శ్రీ

# శఠకోపవిన్నపములు.

గ్రంథకర్త:

శ్రీమాన్ ఓపి కృష్ణమాచార్యులువారు.

ప్రకటనకర్త:

నిడుముక్కల సుబ్బారాయుడుగారు.

ముద్రాపకులు:

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాల, బెజవాడ.

1938

# శఠకోపవిన్నపములు.



శ్లో॥ వృషభేతువిశాఖాభ్యాం [illegible] కురుకాపురికారిజం
పాణ్డ్యదేశేకలేరాదౌ శఠారింసైన్యపంభజే.



వ్యాఖ్యాతలు.

సంశోధకులు:

శ్రీమాన్ డివి కృష్ణమాచార్యులవారు

చ॥ గడుసరిలోభి ద్రవ్యమది కన్నపుదొంగకు బందిపోట్లకున్
బుడమిని వారకాంతలకు భూపతికిన్ జను సజ్జనుండుతా
బడసిన ద్రవ్యసంచయము బ్రాహ్మణకోటికి బంధుకోటికిన్
కడగు తటాకసత్రవన కార్యప్రతిష్ఠకు కూపకోటికిన్.

# ప్రకటన.

శ్రీమచ్ఛఠకోపదేశిక చరణకమల సేవా నిరతులగు శ్రీమాన్ దీవి కృష్ణమాచార్యుల వారిచే సమస్త చేతనోపకారంబుగ రచియింపబడిన ఈ పుస్తకము ము[illegible]అగ్రహార వాస్తవ్యులు శ్రీమాన్ సముద్రాల తిరువెంగళాచార్యులవారి శిష్యులు నిడుముక్కల పిచ్చయ్య, మహాలక్ష్మమ్మగార్ల కుమారుడు సుబ్బారాయుడుగారి ద్రవ్యసహాయముచే సచ్ఛాపింపబడినది. యీ శఠకోప విన్నపములను శ్రీమద్భగవద్భాగవతాచార్య కృపకు పాత్రులు గావలయు నను కోరికగల ప్రపన్న జనులకు సత్యాంతోపకారంబుగ ప్రచురించి యున్నాము. గాన వలయువారికి నిడుముక్కల సుబ్బారాయుడుగారి వలన లభించును.

ఆపదొచ్చినవేళ ఆ విక్రమార్కుండు
కాకిమాంసము తిని కష్టపడడె
అమావాస్య పౌవర్నాన ఆదిత్యచంద్రులు
రాహుకేతులచేత కష్టుపడరె
సప్తదినములలోన సర్పంబు చెయి
జాచి పరీక్షితుకు ప్రాప్తించు
యిట్టివారలెల్ల యిరువున బడ్డారు
మనుజు లెంతటివారు మాయతెలియ.

## —♦ నవరత్నములు ♦—

సీ॥ కంటిరేమనవారు ఘనులు గృహస్థులు
విఘలులై గుడికొన్న వెఱ్ఱితనము
భద్రాద్రులై యుండి పాయరు సంసార
పద్ధతి నూరక పట్టువడిరి
కలయోనులం దెల్ల గర్భదుర్వ్యథల
పురుషుండు దేహియై పుట్టుచుండు
తన్నెఱుంగడు కర్మతంతువై కడపట
ముట్టడు బహుశతములకు నైన
ఆ॥ దీనశుభములేదు దివ్యకీర్తియు లేదు
జగతి పుట్టి పుట్టి చచ్చిచచ్చి
పుట్టనేల మనకు పుట్టనిచావని
త్రోవ వెదకి కొనుట దొడ్డబుద్ధి॥
పుట్టుచావులు రెంటిని బోరయునట్టి
నిర్మలజ్ఞాన సంపూర్ణ నిష్టగలుగు

తెరువునెరిగించు నాతడే గురువరుండు
నవ్యతరభోగి శ్రీసదానందయోగి॥
జీవిపోకమును పె జీవవస్తువులిచ్చి
జీవినిల్పవలయు జీవనముగ
జీవితోలగు వెనుక జీవవస్తువేల
విశ్వదాభిరామ వినుర వేమా॥

శ్లో॥ కామక్రోధశ్చ లోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ తస్మాత్ జాగ్రత జాగ్రతః
శ్లో॥ జన్మదుఃఖం జరాదుఃఖం జాయాదుఃఖం పునః పునః
సంసారసాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత. జాగ్రతః
శ్లో॥ మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధుసహూదరః
అర్థంనాస్తి గృహంనాస్తి తస్మాత్జాగ్రత జాగ్రతః
శ్లో॥ ఆశయా బద్ధతే లోకే కర్మణా బహుచింతయేత్
ఆయుక్షీణం నజానాతి తస్మాత్ జాగ్రతజాగ్రతః

చ॥ ఏను మృతుండనౌదునని యింతభయంబు మనంబులోపల
న్మానుము సంభవంబుగల మానవకోటికి చావునిత్యమౌ
గాన హరిం దలంపు మిక గలదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ బొందెదవు మాధవలోకనివాస సౌఖ్యమున్.
శా॥ మాయామేయజగంబెనిత్యమనిసంభావించి మోహంబునన్
నాయిల్లాలని నాకుమారుడని ప్రాణంబుండునందాక
యంతోఅల్లాడిన యీశరీరమిపుడిందుర్ కష్టంబులన్ గాలుచో
నాయిల్లాలునురాదు పుత్రుడును తోడై రాదు తప్పింపగన్.

శ్రీమతే రామానుజాయ నమః





# శఠకోపవిన్నపములు.



శ్రీనివాసగురుపదాంబుజధ్యానమానసా ! అనంతకోటి బ్రహ్మాండంబులు నౌదుంబరఫల ప్రాయంబున రోమకూపంబులం గలవిరాట్టు - లట్టి విరాట్టులనేకులొక్కొక్క రోమకూపంబునం గలవారు స్వరాట్టులు - అట్టి స్వరాట్టులనంతకోటు లొక్కొక్క రోమకూపంబున నేలువారు పరమ స్వరాట్టు - లిట్టి యజాండంబులను స్వరాట్టులను బరమ స్వరాట్టులను సంకల్పమాత్రమున నేకకాలమందే యుత్పత్తిస్థితిలయంబులం జేసి స్వేచ్ఛావిహారంబులు జరుపుచు బునరుత్పత్తి యేకకాలమందే చేసి కొంతకాలంబు మ్రింగి గర్భంబున దాచినవాడై కొంత కాలంబు గ్రక్కి వెలుపలం బ్రసరింపంజేయుచు దదండంబు లీవ లావలం జిమ్ముచు గందుకక్రీడచే లీలావినోదుండై విరజ కావల పరమపదంబున దిరుమామణిమంటపమందు వేంచేసి

శ్రీభూనీళాది దివ్యమహిషులు సేవింపగా ననంత గరుడ విష్వక్సే
నాదులు గొల్వగా ననంతంబులైన నిత్యసూరులు ముక్తపురు
షులును గైంకర్యంబులు సేయగా నిఖిలహేయప్రత్యనీకుండై
యనంతకళ్యాణగుణపరిపూర్ణుండై శంఖచక్రగదాఖడ్గ శార్ఙ్గాది
దివ్యాయుధ ధరుండై నవరత్నఖచిత నూపుర పాదాభరణ మణి
మేఖలావలయ కటిప్రదేశ దివ్యపీతాంబర చతుర్భుజనై జయంతీ
వనమాలికా శ్రీవత్స వక్షస్స్థల గ్రైవేయహార కేయూర కటక
కంకణ ముద్రికా మకరకుండల మకుట కిరీటాది దివ్య భూషణ
భూషితుండై అశరణ్యశరణ్యుండై భక్తజనాభీష్ట ఫలప్రదా
యకుండై వేంచేసి యున్న శ్రీమన్నారాయణునియందు నద్దం
బున గొండ యున్న చందంబున బ్రణవం బీశ్వరుని ఘటోదకం
బాకాశంబును దమలో నిమిడినట్లు దేవరహృత్కమలంబున నిల్పి
ధ్యానారూఢుండవై పరమాత్మను నానందింపజేయుచున్నాడవు
అంత నఘటనాఘటన సామర్థ్యుండవే నమోనమో శ్రీశఠకోప
దేశికోత్తమా॥ ౧

బుక్కపట్టణనివాసా! మీదివ్యమంగళ విగ్రహంబైన
తిరుమేనునకు నాయురారోగ్య మస్తు. మీ యవయవంబులకు
శుభమస్తు. పరవాది భయంకరంబైన మీ వాగ్జృంభణంబులకు
జయంబు గావలయు. దేవరపురుషకారత్వంబుచే సన్నిధి కైం
కర్య నిర్వాహకులైన రామానుజమ్మకు సుభద్రి నాంచారమ్మ
గారికి నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి యగు. మీ శాంత శమ ద
మా ద్యనంత కళ్యాణగుణ కరుణాకటాక్షవీక్షణీయంబులకు

క్షేమంబు. మీ తేజోగాంభీర్య సౌశీల్య సౌకుమార్య వాత్సల్యాదులకు నభివృద్ధికరం బగు. మీ సౌలభ్యాతిశయ వైభవంబులు దేవర దాసానదాస చరమ పర్వదాసుడైన యడియనిపర్యంతంబు ఫలింపవలయు. మీరు వేంచేసియున్న దివ్యదేశంబున నెల మూడు వర్షంబులు వర్షించి పాడిపంటలు సమృద్ధి నొందవలయు. మీ రుండు పట్టణంబున నిత్యకళ్యాణంబు పచ్చతోరణంబులు భాసిల్ల బ్రజలు భాగ్యవంతు లగుదురు. దేవరదివ్య తిరువడిఘుళ కనంతంబులైన సేవింపులు సేవించెద, నట్లేల సేవించెద నంటిరా, స్వాముల దివ్యావతారంబులు చేతనాచేతనుల సంరక్షణార్థంబు గనుక మంత్రిమంత్రార్థాధీన దైవంబు మీ యధీనంబుగదా యని మీకటాక్షంబున ననంత జీవకోటులకు బరమపదంబు గల్గి నిర్భరానందపరవశు లగుదురు గాన మీరు లెస్సైయుండుకే మేలు నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౨

శఠారీ! రాజస తామసంబులు పెనగొని దేహాభిమానంబుల బరపీడనంబు చేసి హీనకులంబునం బుట్టి జననకాలంబున లేశమాత్రంబు భగవత్కటాక్ష వీక్షణంబు గల్గెగాబోలు శాంతుండనై నిర్వాణపదప్రాప్తింబుకై కైంకర్యంబులు చేసి భగవానుల నారాధింతు నని పూని శరీరాయాసంబుల కోర్వంజాలక మాని జ్ఞానంబున నీశ్వరుని నారాధించెద నని చిత్తచాంచల్యండనై యుడిగి భక్తినిష్ఠచే శ్రియఃపతిని గొల్చి సేవింతునని తలంచి యెడతెగని భక్తికి మనస్స్థిరత లేక యింక నేమిచేయుదు నని విచారించుచుండ నాడబోఖున తీర్థం బెదుట గనుపించినట్లు

వెదుకఁబోయిన మందుతీగె వేళ్లఁ దగిలినట్లు మొక్కఁబోయిన వేల్పు ముందర బ్రత్యక్షమైనట్లు దేవరవారడియానికి సుప్రసన్నులరై ప్రసదనంబు చేయించితిరి. చేయించిన మాత్రంబగాని ప్రపన్నోపాయం బెట్టిదో యెరుంగ. మీరు నియమించిన ప్రపన్న వాడం గాను. ద్విపాదపశుతుల్యుండను. ఇట్టి హీనుండని పరిహరించక చేరఁబట్టితిరి. పట్టు విడువనిది దేవరవారికి స్వభావంబు. ఏ నెట్టివాడనైన గాని దేవరవారు చేసిన ప్రపత్తియు నడియని పర్యంతంబు ఫలించె. నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ 3

పరకాలసూరీ! నామనోగుణంబు లొరులకు గాసరావు. నాగుణంబులు మరుగునట్టిక దేవరవారికి విన్నపంబులు సేసెద. నా బహ్మచర్యంబులు ఘోటక బ్రహ్మచర్యంబులు. నా సద్వర్తనంబు పిల్లిశీలంబు. నాజపంబులు సింగళజపంబులు. నాయుపవాసంబు లజగరోపవాసంబులు. నా ధ్యానంబులు బకధ్యానంబులు. నా వినయనైచ్యంబులు నక్కవినయనైచ్యంబులు. నా చేష్టలు మర్కటచేష్టలు. నామనంబు శునకవాలంబు వంటిది. నాబుద్ధి నలినపత్రజలంబువంటిది. నావేషంబు పుప్పిపండువంటిది. నా వర్తనంబు లుమ్మెత్తకాయపోలికె. నా హృదయంబు కఠోర రూపంబు. నా ముఖంబు వ్యాఘ్రముఖంబు. నానోరు తోడేలు. ఇన్నియు మొదట నాయందె కలిగియున్నవి. ఇట్టి వానిని నన్నేలిన దేవరవారికి బ్రయాసం బధికంబు. అటువలె నున్నను బట్టుచీర నెరవు లిచ్చి పీటపట్టుగా నెంట గరిగినట్లును, ధనికుండు ధనం బిచ్చి పుచ్చుకున్నవాడు చెడకుండ కనిపెట్టి తిరిగి కాచినట్లును నను గాపాడికొని తిరుగవలయు. నా స్వభావంబు శునక

న్యాయంబునంటిది. దేవరవారిస్వభావంబు మార్జాలకీచకన్యాయ చందంబు. నన్ను వదలవలదుసుమీ. నమో నమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౪

శ్రీరంగపొన్నడీ! అనాదికాలంబుననుండియు నేనెత్తిన జన్మంబులు లెక్కింపరాదు. తారా తుషార వర్షధారా భూరేణువులు లెక్కించు నజునకైనను శక్యంబు గాదు. నే జేయు స్తన్య పానంబు సప్త సముద్రోదకంబుల కంటె సహస్రాంశంబు లధికంబులు. నాపై బెట్టుకొన్న కులగోత్రరూపనామంబులీ చతుర్ముఖుండు గాక యిక గొందరు సహస్రముఖబ్రహ్మల కైనను గణింప నగోచరంబులు నే భుజింపని పదార్థంబులు బ్రహ్మాండంబున లేవు. నే జేసిన పాపంబు లనుభవరూపంబుచే వ్యయంబు గాదు. అట్లైనను బ్రహ్మాండంబునం బట్టజాలదు. నే ననుభవించిన నరకంబు లష్టావింశత్సహస్రసంఖ్యలు గలవు ఒక్కొక్కటి ననేకమారు లనుభవించితి, నైనను నే జెప్పుకొనరాదు గాని నాయంత పాపిష్ఠుడు లేడు. అది యెట్లంటిరా, అనంతకోటి బ్రహ్మాండంబులు కటాక్షలేశమాత్రంబున గల్పించు భగవన్మాతిరోహితుండనైన యతనికి బ్రీతికోటినైన పాపిష్ఠాగ్రేసరుండనైన వేగింపుచున్నాడ గాని విడుపు లేదు. అతనికిం గ సాయుజ్యం బడియానికిం గలదు. ఇట్టి యడియేని జేపట్టి పునర్జన్మంబు లేక యథయాం బొసంగి కింకరునిగా నేలుకొంటిరి. దేవర సామర్థ్యంబును, మహోపకారంబును విచారించి లెక్కింప జతుర్ముఖ పంచముఖ షణ్ముఖ సహస్రముఖుల కైనను శక్యంబు గాదు. ॥నమో నమో॥ ౫

శ్రీశైలాన్వయతిలకా! అడియెడను నే గుణంబువలన దేవర తిరువుళ్ళంబు చొప్పున దదీయ కైంకర్యంబులకు సహాయంబుగా ధనం బొసంగి సంతోషపెట్టెద నంటినా, నిర్భాగ్యదామోదరుండ. మీ సాన్నిధ్యంబున నిరంతరసేవకాపరుండనై ద్రావిడ వేదపారాయణము చేసికొని యుండి తరించెదనంటినా, దారాపుత్రాదులందు నీషణత్రయోదిత్రయములచే బద్ధుండనై వదలజాలక యున్నవాడ. దేవర దాసాన దాసులకు సాష్టాంగ సేవింపులు సేవించి వారల కింకరపరుండనై యూడిగములు చేయుచునుండెదనంటినా, కులాభిమానాభిజన విద్యావృత్తులు వదలంజాలక చెరుపుచున్నవి. ఎందులకు బోవక దేవరవారు నియమించినట్లు మీసన్నిధి నాశ్రయించి యొదిగి వర్తించెద నంటినా, లోకదూషణంబుల కులికిపడుచున్నవాడ. నా జన్మంబు నిరర్థకంబైన శాల్మలీవృక్ష చందంబువంటిదయ్యె. నామనంబు పయిరు మేయంజను దొంగ కోడెవంటిదాయె. నావర్తనం బతిరహాస్యంబైన చోరవర్తనంబయ్యె. నా వాగ్వచనంబులు పరనిందాస్పద కారణంబులాయె. నాశరీరోత్పత్తి జెప్పసిగ్గయ్యె, నదెట్లన్న శుక్లశోణితంబైన ముట్టుబొమ్మబోలు; మఱి మూత్రపురీషక్రిమి జాలాది సంకులంబై యపవిత్రంబయ్యె. రక్తమాంస అస్థిగత చర్మ రోమ పూరితంబైన యీ దేహంబుపై మోహంబు వొడమి మత్తుడై పొరలుచున్న వాడ; నెన్నివిధంబుల నెంచి చూచిన నడియని హేయగుణంబులు పూర్ణంబులు గాన దేవర దివ్యతిరువడిగళు సేవించి యొక్క విన్నపంబు జేసెద. దానునికి బురుష భూతులయిన రామచంద్ర కూరేశాది దేశికోత్త

ములఁ జూచియైనను నడియనికి నప్పటప్పటికి బుద్ధులు చెప్పి పరామర్శించు నెలయపెరుమాళ్ళయ్యగారిని దలంచియయినను లేదా దేవర దయాదాక్షిణ్య శరణ్యాశరణ్యత్వంబులకు గొరత వచ్చు నని విచారించి విడువక కృపచే రక్షింపవలయు జుమీ.
నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౬

శ్రీమత్పరాంకుశా! అడియని దోషంబు లెంతని విన్నపంబుచేయుదు. చెప్పక దాచరాదు. ఏమని యంటిరా, చిత్తగింపుడు. ఈషణత్రయంబులపై గల యాశయు దేవర తిరువడిఘళ్లపై నుంచనేర. దేహబంధువులందుగల మమత యాత్మబంధువులైన శ్రీమహాభాగవతులందు గలుగనేరదు. పరకాంతలపై బారెడి మమకారంబులు భగవద్భాగవతాచార్యులపై బారదు. పంచేంద్రియంబుల బొల్పడు సుఖంబు దేవర శ్రీపాదతీర్థతళియ ప్రసాదస్వీకారంబులకై బ్రీతిగొనదు. దుర్గంధాదులకిరవైన దేహంబు నాది నే నను నహంకారంబు ముందుబడి యాత్మ సమ్మిటపెట్ట పాలుచేసెదగాని సదాచార్యులకృప నాశ్రయించి యీశ్వర శేషభూత శేషత్వ పారతంత్ర్య తదీయపరులం జేరనైతి. బ్రహ్మహత్యాది పాతకంబులకంటె నెక్కుడైన మద్వికారాదులు క్రూరంబు లని వినియుండుగాని వానిలో నణుమాత్రంబు విడువనైతి. అరిషడ్వర్గంబులు పగతు లని యెఱుంగుదుగాని వాని నేపాటిం గెలువ జాలనైతి. నడియనియం దిట్టి యపరాధంబు లెన్న శక్యంబులు గావు. వీని శిక్షించ నడియనికి శక్తిచాలక దాసరితప్పు దండంబున బోవు నందురుగావున దేవరకు సాష్టాంగదండప్రణామంబు చేసితిగాని మీసన్నిధి నాశ్రయిం

చనైతిని. దూరంబుననుండి సేవించిన మే మెట్లు క్షమించుద మంటిరా, మేఘంబులు దూరంబుననుండే మయూరంబుల బలం గించుట. సూర్యుండు లక్షయోజనంబులనుండియే కమలంబుల నానందింపజేయుట. చందురుండు రెండులక్షల యోజనంబులం దుండేకదా కోకనద కైరవంబుల దృప్తింజేయుట. అట్లు నే నెచ్చట నున్న దేవరవారు వాత్సల్య సౌలభ్యాతిశయ కృపచే నేలుకొని రక్షింపవలయుజుమీ. నమోనమో శ్రీశఠకోప॥ ౭

కారినందనాంశసంభవా! జగంబున పాతకంబులు శుష్కార్ద్రరూపంబుల రెండువిధంబులై యుండు. అవి యెట్లం టిరా, అజ్ఞానియై పుణ్యపాపంబు లెఱుంగక చేసిన దురితంబులు శుష్కంబులు. వానికి దేవతా ప్రార్థనయును, అన్నదాన జప హోమ కృచ్ఛ్ర చాంద్రాయణ తీర్థయాత్ర గోదాన భూదాన షోడశ మహాదానములును, ఉపవాస మాదిగాగలవ్రతంబులచే ప్రాయశ్చిత్తములు గలవు. జ్ఞానియై యిది త్యాజ్యం బిది యుపా దేయ మని యెఱింగి చేసినదోషంబులకు వాని కెందును ప్రాయ శ్చిత్తము లేదు. అదియు వేదశాస్త్రజన్యజ్ఞానంబు నెఱింగి యనేక పాపంబులు చేసితి. అట్లుచేసిన నడియునిచేత దేవరవు చేయించిన ప్రపదనంబుల వలన నవి యెల్ల నష్టం బయ్యె; నింక నేమని యుం టిరా, ప్రపన్నుండనైన వెనుకజేసిన పాతకంబు లపరిమితంబు లివి. భగవద్భాగవతులచే క్షమియింపవలయునని కొందరార్యులు చెప్పుచుండ నత్యంతభయంబుగలిగియుండ సదాచార్య కృపచే నొక్క రహస్యంబు దెలిసె. ఈక్షణ ధ్యాన సంస్పర్శనంబులచే మత్స్య కూర్మ విహంగంబులు దమ పిల్లలను దృప్తిచేసి కాపా

డినట్లు దేవర యడియొనిని మరువక పితాపుత్రన్యాయంబున
నేలుకొందు రట॥ ౮

సాంసార సాగరోత్తరణీ! దేవరకృపచే సామాన్యశాస్త్ర
ప్రకారంబులు విన్నపంబు చేసెద. వటునకు వేదాధ్యయనం
బులును గృహస్థున కతిథిపూజయును వానప్రస్థునకు బర్ణగృహ
ఫల మూలాశనంబును యతికి నిస్సంగత్వంబును అజగరవ్రతు
నకు బ్రాప్తాశనంబును బ్రాహ్మణున కాచారంబును క్షత్రియు
నకు బ్రజాపాలనంబును వైశ్యునకు గృషివాణిజ్యంబును శూద్రు
లకు ద్రివర్ణసేవకంబులును అఖిలవర్ణములకు భూతదయా
దాక్షిణ్యంబును సుతులకు మాతృపితృ సంరక్షణంబును నుడు
వులకు యాథార్థ్యంబును సమస్త మానవులకు బరోపకారం
బును వనితలకు బరపురుషతిరస్కార భర్తృసేవనంబును ఇట్లు
పుణ్యలోకంబునకు జనుటకు కారణనియమంబులు; నిక బ్రపన్ను
లకు భగవద్భాగవతాచార్యులయెడ నపచారంబు లొనర్పక
మెలంగుటయు. పురుషకారసన్నిధియందు బరగత స్వీకారం
బంగీకరించి శరణాగతుండై తత్సేవానిరతుండగుటయు అభ్యాగ
తారాధనంబు లాచరింప వలయు. ఇవి పరమపదప్రాప్తికి గార
ణంబు; లడియొనిజన్మంబులు విచారింపగా బూర్వకాలంబున
నుండి శాస్త్రోల్లంఘనంబుచేసి వర్తింతు. ప్రవృత్తినిష్ఠకుంజొచ్చి
భాగవతాపచారంబులే చేయుచు నాచార్యసేవాదూరుం
డనై రెంటికిం బాసిన రేవణిచందంబైతి, నిట్టి యడియొని దుర్గు
ణంబులుచూడక శిశువునకు దెగులు పుట్టినయెడల దల్లియౌషధ

సేవచేసి పథ్యాహారంబుచే బాలుని రక్షించిన తెలంగున దాసు
ని చేసి నను వక రక్షించు బిరుదుసుమీ. నమో నమో॥ ౯

గురుసార్వభౌమా! నాముంగొంగు ముత్యంబు నీవె. నామూలధనంబు నీవె నా తల్లిదండ్రివి నీవె. నాయెల్ల చుట్టంబు నీవె. నాయిలువేల్పువను నీవె. నాయేలుగడయు నీవె. నాపాలికల్పవృక్షము నీవె. నాకామధేనువు చింతామణియు నీవె. నాకర్తవు నాభర్తవు నీవె నాబహుజన్మార్జిత పుణ్యరాశివి నీవె. నాభాగ్యదేవతవు నీవె. నాకు మంత్రమంత్రార్థ ప్రతిపాద్యప్రథమాచార్యుడు నీవె. నాకు బ్రాప్యప్రాపకంబులు నీవే. నా ఉపాయోపేయంబులు నీవే. నాతోడునీడవు నీవె. నను రక్షింపంబూనిన శ్రీభాష్యకారుడవు నీవే. నాకులనాయక రత్నంబైన నమ్మయాళ్వారు నీవే. నాసాంప్రదాయకర్తయైన పెరియజియ్యరు నీవె. నాకు బురుషకారులైన పెరియపిరాట్టియు నీవే. నాపాలిటి పరమపదనాయకుండైన పెరియపెరుమాళ్ళు నీవే. దేవరవారు తప్ప గత్యంతరం బెఱుంగనిది సత్యంబు సత్యంబు పునస్సత్యంబు నమ్ముమీ॥నమో॥ ౧౦

తింత్రిణీతరునివాసా! యేను దేహాధారుండనై మాతృగర్భంబు వెడలి యశక్తుండనై మలమూత్రంబులం బొరలుచు దల్లిచే లాలనతోషణంబులం బొంది కొన్నిమాసంబులు గడపి బాల్యంబున బుద్ధిహీనుండనై బాలక్రీడా వినోదంబులచే గొంతకాలంబు పుచ్చితి. యౌవనంబున స్త్రీలోలుండనై నిరంతరకామాసక్తిచే గొన్నియేండ్లు దిరిగితి. నిద్రాది వ్యవహా

రంబుల గొన్ని హాయనంబులు చనియె. గతజన్మసహస్రంబులకు సుకృతలేశమాత్రంబును గలుగఁబోలు. వాకంబున దేవరతిరువడిగళ నాశ్రయించితి. ఎంతనుండియును భగవద్గుణానుభవంబు సేయుచు గాలంబు జరిపెదనంటి. నాగృహంబున నున్నంతసేపు వృకంబులచే బీడింపంబడిన గోవత్సంబునుంబోలె దారాపుత్రాదులచేత నశనాచ్ఛాదనంబులకై బాధితుండనగుచు నివాసంబు వెడలి ఫణిముఖంబునం జచిన కాకులంగో గోయిలం బోలె దుస్సహవాస దురాలాపంబులచే దుఃఖితుండనై నొక్కొక్కవేళ సద్బ్రహ్మచార్యుల సహవాసంబు గలిగెనేని వారి కృపచేత విజనస్థలంబునం జేరి భగవద్గుణానుభవంబునైన నద్గ్రంథకాలక్షేపాతిశయవిభవంబు సమయంబున ననాది కాలంబున నుండియున్న ప్రకృతివాసనాగులచే నచ్చు నావలింతలు నిద్రయు నలసటయు బందతనంబును ఇదిగాక లోకదూష్యాదుల కులికిపడి యుభయతీరపశువుంబోలె జాపల్యచిత్తుండనై పరదారా పరధనాపేక్షాపరుండనై భ్రమియింపం జేయు మనంబు మరల మగుడింపంజాలక ఖేదంబునొంది యంతట దేవరతిరవడిగళ జాయమానకటాక్షంబుచే నేలినవారి సేవకుం బాసితిగదా యని భయంబు నొంది బహుభంగుల గాలంబు జరుపుచున్నాడను. శీఘ్రంబున దేవర సన్నిధిం జేర్చుకొనుమీ ॥నమోనమో॥ ౧౧

అస్మత్కులపతీ! సంసారగహనమధ్యంబున నే నున్న ప్రకారంబు వివరించెద. అజగరంబుచే గబళింపబడిన శశకంబునుం బోలె గాలంబుచే మ్రింగబడినవాడ. పొంచియున్న పాము

సమీపంబునం దిరుగు గప్పయుంబోలె మృత్యువశంబై తపింప బడుచున్నవాఁడ. ఆకటిపెల్లున దిశలు నిరీక్షించు పులిసాన్నిధ్యం బున నుండు మృగమునుంబోలె కాలకింకరునిచే నిరీక్షింపబడి మృగయుం డొడ్డిన యురులం బడియున్న పక్షిచందమునుంబోలె రోగములచే నొచ్చియున్నవాఁడ. భూతంబుసోకిన లుబ్ధకునిబోలె జారకాంతలచే గాఢాలింగితుండనై క్రీడించుచున్నవాఁడ. వృకం బుచే నావృతంబైన కొండగొఱియయుంబోలె దారాపుత్రాది యీషణత్రయంబులచే బీడితుండనై యున్నవాఁడ. చనుదెంచు మధుమక్షికలచేతం బాదువంబడిన తేనె కపేక్షించిన ముగ్ధ చంచతయుంబోలె తాపత్రయాదులం దగులంబడి యింద్రియ బాధితుండనై యున్నవాఁడ. ఒక్కొక్కస్థలంబున గొఱవిదయ్యం బును చూచి యగ్నికై చను నెఱుకవానింబోలె ధనాభిలాషినై కలవారి యిండ్ల చెంతను జేరియును గాఢాంధకారరాత్రిం జని యీరంబులు దూరి తెరువుగానని పథికుండునుంబోలె బెక్కుడు మలం బడి చరనోపాయంబెఱుంగ శాస్త్రమార్గ పుణ్యపాపంబులే యొనర్చుచున్నవాఁడ. యాదవపత్రికాశుండు వంచించి యిల యాళ్వారుల గాఢాంధకారగహనంబున విడిచిపెట్టి యొంటిజిక్కి తెరువుదెలియక వగచుచున్న సమయంబున నెలయాళ్వారుల గాంచీపురిసాన్నిధ్యంబుజేర్చిన దేవప్పెరుమాళ్ళునుంబోలె దేవర కృపాకటాక్షంబుచే నడియెనికి బ్రత్యక్షంబై మత్కర్మ గహనంబు దహనంబు చేసి యిక మీాబానిసెబానిసెనుగ నేలుకొని రక్షిం పవే॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౧౨

కాండిన్యగోత్రతిలకా! నదులలో భాగీరథియు నక్షత్రంబులందు గళానిధియు గ్రహంబులందు ప్రభాకరుడును తరువులం దశ్వత్థవృక్షంబును పక్షులందు గరుత్మంతుండును ఋతువులందు వసంతఋతువును మణులయందు కౌస్తుభమణియును పుణ్యక్షేత్రములందు శ్రీపురుషోత్తమంబును విగ్రహసౌలభ్యమందున పెరుమాళ్ళును ధేనువులందు గామధేనువును హయంబులందు నుచ్చైశ్శ్రవంబును గజంబులం దైరావతంబును దేవఋషులయందు నారదుండును దానంబులం దన్నదానంబును వ్రతములందు ఏకాదశీవ్రతంబును వేదంబులలో సామవేదంబును అక్షరంబులలో నకారంబును ఆశ్రమంబులలో గృహస్థాశ్రమంబును కులంబులలో బులస్త్యుండును మానవులలో వైష్ణవుండును ఘనంబులైనట్టి పాపంబులు సేయువారలలో నేనును మహాధికుండనైతి నిట్టి యడియెని యొనర్పు కల్మషంబులు భోగ్యంబులు సేసికొని వీనిని విడువక రక్షింతువనియెడు బిరుదు వహించి యేలుకొన్న దేవరవు కర్మధర్మంబాచరించక త్యాజ్యోపాయనిష్ఠయే సత్యంబని యనుష్ఠించి యస్మదాదుల నేలుకొన వైష్ణవశిఖామణివై యవతరించి యాచార్యవరులలో గారణాచార్యులైన మహాఘనులని చాటించుటకు నెంత పనికైన నిలిచెద॥ నమోనమో శ్రీ శఠకోప దేశికోత్తమా॥ ౧౩

ఆచార్యపట్టభద్రా! ధర్మసంస్థాపనార్థంబునకై దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలనార్థంబు కొరకు శ్రీయఃపతి యవతరించిన శ్రీకృష్ణావతారంబున వ్యాస పరాశర నారదాది మహా

ఋషులును పాండవ విదుర భీష్మ ద్రోణ కృపాచార్య యుద్ధవాక్రూరాది బాంధవులును దేవకీవసుదేవ నందయశోదాది జననీజనకులును కుంతీ ద్రౌపదీ కుబ్జా గోపికా యాజ్ఞవల్క్యాది స్త్రీలును కుచేల సాందీపాది బ్రాహ్మణులును ముచికుంద జనకాది రాజులును బ్రహ్మేంద్రాదిసురలును పరతత్వంబైన శ్రీనారాయణుం డితం డని భజియించి యిష్టకామ్యార్థంబులు లభించుకొని ఆనందంబునుం బొందిరి. ఇతరులైన శిశుపాల దంతవక్త్ర కంస ముష్టిక చాణూర పౌండ్రక వాసుదేవ సుదక్షిణ సాళ్వ జరాసంధ ముర నరకా అఘాసుర బకాసుర వత్సాసుర ధేనుకాసుర శకటాసుర ప్రలంబాసుర బాణాసురాది రాక్షసులును, శకునిదుశ్శాసనాది రాజులును, రాక్షసులును మొదలయిన దుష్టవర్తనులు జారుండవనియును చోరుండవనియును గోపాలకుండవనియును కులగోత్రహీనుండవనియును వావి వర్తన లెరుంగడనియును దూషించి నిరంతరస్మరంబు చేసి శిరచ్ఛేదంబులం జెందిరి. అట్లు చేతనసంరక్షణార్థంబుగా దేవర వారవతరించి కులగోత్రంబు లెంచక చేతనుల దోషంబులు భోగ్యంబుచేసికొని అస్మదాదిహీనుల నేలుకొని రక్షించి పరమపదప్రాప్తులం జేయుచుండ కొందరజ్ఞులు దేవరవు దురాచారుండవనియును కర్మ ధర్మ దూరుండ వనియు హీనకుల ప్రవర్తనుండవనియును భక్ష్యాభక్ష్యుండ వనియు దూషించి పాపంబులార్జింపుచున్నారు. వారలగతి యెట్టిదో యని దేవర వెంచెదవు

॥నమో॥ ౧౮

తిరుమలవంశపావనా! దేవరతిరువడిఘళాశ్రయించిన దాసబృందములైన స్వాముల కెల్ల బరమపదంబు గలదని బ్రహ్మరుద్రేంద్రాదుల వలన శ్రుతిస్మృతీతిహాస పురాణాదులచే సిద్ధాంతంబై యున్నది. ఈ రహస్యార్థంబు లోకంబుల కొందరయ్యు లెఱుంగ లేక యభిజన విద్యావిత్తంబులచే విఱ్ఱవీగుచు భాగవతాపచారంబుల కొడంబడు చున్నవారు. ఇట్టి యపచారార్జితులం జేరక దేవర దివ్యతిరువడిగళాశ్రితులై సేవించిన వారికి బరమపద ప్రాప్తం బని దావ దహన దందహ్యమాన మందు దూరి గెల్చెద. వైష్ణవభక్తపరిపూర్ణుండై మీదివ్య తిరుముఖ మండలంబు సేవించి యానందించిన ముక్తుండౌనని విషనిశ్వాస కృష్ణసర్పంబునైన బట్టి విడిచెద. మీ నామోచ్చారణ మాత్రంబున మోక్షప్రాప్తి యగునని కుపిత దంష్ట్రా కరాళంబైన బెబ్బులితోడం బెనంగి పారవైచెద. మీదివ్య శ్రీసూక్తి లాలకించిన వారికి సపవర్గంబు గల దని జంఝామారుతోత్తుంగతరంగంబైన సముద్రంబునం బడి తీరంబు చేరి సుఖించెద. మీరు కటాక్షించిన వారికి యమదూతల భయంబు లేదని అతిసశిత ధారలుగ కత్తులబోను దూరి వెడలెద. మీదాసాన దాస దాసుండైన మాత్రంబున పునర్జన్మ భయంబు లేదని మదోన్మత్త భద్రదంతావళంబుతో నెదిరించెద. దేవర కృపా పాత్రులైనవారు రవిమండలంబు భేదించుకొని చంద్ర సూర్యాదిబ్రహ్మరుద్రేంద్రాదులచే సర్చింపంబడి యావల విరజానది దాటి పరమపదంబున నిత్య సూరి సంయుక్తుండై శ్రియఃపతి సేవానందనిరతులై యుందురని గండకత్తెరల తల యుత్తరించు

కొని పునర్జీవితుఁడనై మీసన్నిధి జేరెద నింతనిర్భరత్వంబు నీకెటువలె గలిగె నంటిరా దేవరమాహాత్మ్యంబునంగాని బంటుశక్తి గాదుసుమీ॥ నమోనమో॥ ౧౫

వకుళభూషణా! భగవదనంతావతారంబులయందు రామకృష్ణావతారంబులు పూర్ణషాడ్గుణ్యయుక్తంబులుగదా! తదవతారంబులకును దేవరదివ్యావతారంబునకును తారతమ్యంబు విచారించిన శ్రీకృష్ణావతారంబున ద్రౌపదికి వస్త్రలాభంబును పాండవులకు రాజ్యపదప్రాప్తియును కుచేలునకు ధనధాన్యసంపత్తియును పుష్పలావికునకు నైశ్వర్యంబును కుబ్జకు సౌందర్యంబును గోపికలకు దిరుమేని సంగమసుఖంబులును ఉద్ధవునకు జ్ఞానోపదేశంబును ముచికుందునకు జన్మాంతర మోక్షంబును భీష్మునకు వసువులలో ముక్తియును సాందీపునకు మృత పుత్రలాభంబును తనకు బదరీఫలంబు లొసంగిన బీదరాలికి రత్నఫలంబొసంగె గాని యిందరికి పరమపదంబు లేదు. ఇంక శ్రీరామావతారంబున నహల్యకు సుందర స్త్రీరూపంబును విశ్వామిత్ర మఖ సంరక్షణంబును, జటాయువునకు స్వర్గలోకంబును త్రిజటభూసురునకు ననంత ధనరాశియును చమరీమృగంబునకు ప్రాణప్రదానంబును హనుమంతునకు బ్రహ్మపట్టణంబును సుగ్రీవునకు కిష్కింధారాజ్యంబును విభీషణునకు లంకాభిషేకంబును మఱియు జరమకాలంబున నయోధ్యావాసులకు నర పశు పక్షి క్రిమి కీట వృక్ష తృణ లతాగుల్మాది స్థావర జంగమంబులకు నేకకాలంబున సాంతలోకముక్తియు నిచ్చె గాని విరిజానది దాటింప లేదయ్యె. దేవర సామర్థ్యంబు జూడ

మాయభిమానాంతర్భూతులై బదిగి వర్తించిన దాసానదాసులైరేని జడాంధ బధిర మూగ పంగు బాలవృద్ధ మ్లేచ్ఛహూణ కిరాత పశుపక్షి మృగాదిచేతనాచేతనులైన వారికి విరజానది దాటించి పరమపదంబున వేంచేసియున్న యిందిరాస్తన్య పానంబున దృప్తులంజేసి యిష్టకైంకర్య వినియోగార్హులంజేసి యేలుకొందురట॥నమోనమో॥ ౧౬

దీనరక్షకా! దేవరవు పరవ్యూహ విభవాంతర్యామ్యర్చావతారంబులై ఈశ్వరుండవై మమ్ముల నేలపట్టెద రంటిరా విన్నపంబు చేసెద. సంసార ఘోరాటవియందు దగిలి ప్రకృతి వాసనల విషయాంతరంబులం జిక్కి తాపత్రయతప్త మానసుండనై దప్పిగొన్న యడియెసి పరవాసుదేవుల బట్టెదనంటినా బ్రహ్మాండ బహిరండావరణ జలంబువంటివారు నాకెట్లు దొరికెదరు. వ్యూహ పరిపాలకులైన వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధుల బట్టెదనంటినా క్షీరసాగరంబు వంటివారు. నేనెక్కడ వారెక్కడ. ననుభవంబెక్కడ. ముఖ్యావతారంబులైన నృసింహ రామ కృష్ణాద్యవతారంబుల దొరికించుకొనియెదనంటినా నదీప్రవాహంబులవంటి వారొక్కొక్క కాలంబున నవతరించి మఱొక్క కాలంబునం బ్రసన్నంబు గారు. నేనెన్నటివాడ వారెన్నటివారు. నాలోనున్న యంతర్యామిని సేవించెదనంటినా భూగతజలంబు వంటివారు పారగుద్దల్లంద్రివ్వ తట్టలగుండ మన్నుమోసి నూయిద్రవ్వక దొరకని యట్లు యమనియమధ్యాన ధారణా దృష్టాంగయోగ సామర్థ్యంబులంగాని కానరారు. కనురూపశ్రమంబు జెప్ప నలవిగాదు.

ప్రిత్యక్షంబై యుందరనున్న యర్చావతారంబుల వశంబుజేసు కొనియెద నంటినా పద్మకైరవకోక నదాకీర్ణంబైన పద్మాకరంబువంటివారు. అర్థబలహీనుండను. ఆశ క్తిగలవాడను. అడిగిడి నడువజాలక బడియున్నవాఁడ. దివ్యదేశంబులకేగి నేనెట్లు సేవించువాఁడ. నందనిమార్గినిపంక్తికాశబడ ఫలంబెట్లు. అట్లుగాన వారిని సేవించి కడతేరుటెట్లు. ఇవియన్ని యిట్లుండ మా మూలధనంబువలె గరతలామలకంబునుంబోలె హ స్తగతంబైన ఘృతకలశంబునుంబోలె పరమధర్మంబెరిగించి యేలుకొను పరమ భాగవతో త్తములు దేవరవారు ప్రిత్యక్షంబై యుండ దేవర దివ్యతిరువడిగళకు శరణాగతుండనై మదీయవ ర్తనంబు దేవర సన్నిధింజేరి చేసెద. దేవర చి త్తంబడి యనిభాగ్యంబెట్లు చేసిన జేయును॥నమోనమో శ్రీశఠకోపదేశికో త్తమా॥ ౧౭

సంసార సాగరో త్తారకా॥యీలోకంబులో మానవులకు బ్రాయశ్చి త్తంబై పుణ్యలోకంబు గల్గుటకు జాంద్రాయణ దేవతాసేవ తీర్థాచరణ తపోదాన యజ్ఞాదిక్రియలును సంతర్పణ సమారాధనాది గోదాన భూదాన హిరణ్య దానములుం జేసి స్వర్గలోకప్రా ప్తి గావలయు నందు విధులు చెప్పుచున్నవి. అడియెడను మహాపాపియని పలుమారుం జెప్పనేల. అడియెని భాగ్యంబున నేరుపుననే ప్రాయశ్చి త్తంబు జేసికొని తరించితిని. నదియెట్లంటిరా యేబదికోట్ల భూప్రిదక్షిణంబులు చేసినఫలంబు. దేవరకు నొక్కమారు ప్రిదక్షిణంబుజేసి లభించుకొంటిని. నూటయెనిమిది దివ్యదేశంబులలో వేంచేసియున్న స్వాముల దర్శనంబును దేవర దివ్యమంగళవిగ్రహ సేవనంబు

చేతనే కలిగె. మూడుకోట్ల యేబదిలక్షల తీర్థాది స్నానపాన ఫలంబులు స్వాముల శ్రీపాద తీర్థపానంబునందే ఫలించె. తులా దాన హిరణ్యదానాది షోడశ మహాదాన ఫలంబులు దేవర ముందరనొక్క తాంబూలంబుబెట్టి సేవించిన మాత్రంబుననే లభ్యంబయ్యె. చతుర్వేదంబు లారుశాస్త్రంబులు సప్తాదశ పురాణేతి హాసాదుల పారాయణఫలంబులు మీశఠకోపరామా నుజ వరవరాది నామస్మరణంబువలననే ఫలితంబయ్యె. సహస్ర కోటుల బ్రాహ్మణ సంతర్పణంబులు చేసినఫలంబులు నొక్క భాగవతునికి దదీయారాధన చేసిన మాత్రాననే సమకూడిన దయ్యె. నాహృదయకమలంబున లక్ష్మీనారాయణ శ్రీలక్ష్మీ నృసింహ సీతారామ భరతశత్రుఘ్న హయగ్రీవ శ్రీకృష్ణాది దివ్యావతారంబులు ధ్యానంబుచేసిన యానంద రసంబులు దేవర దివ్యమంగళ విగ్రహధ్యానంబుననే ప్రాప్తంబయ్యె. బ్రహ్మచర్య గార్హ్వ వత్యయత్యాశ్రమాది విహితంబుల ఫలంబు లన్నియు మీతిరువడిగళయందు నొక్క తులసీదళంబు సమ ర్పించిన యంతనే లభ్యంబయ్యె. మీరు పంచసంస్కార సంప న్నుని జేసినంతనే కాయశుద్ధియయ్యె. మీదాసానదాసుడై దేవర యాజ్ఞా పరతంత్రుడనని యొదిగి వర్తించిన మాత్రాననే యాత్మ యుత్తరించె నింక నడిమెనికి నెందును గొదువలేదు. వులగడిగిన ముత్యంబునుంబోలె బుటరబుబెట్టిన కుందనంపు మేలిమియునుంబోలె సానదీరిన మాణిక్యంబునుంబోలె జికిలి చేసిన ఖడ్గంబునుంబోలె శరత్కాలనిర్మలోదకంబునుంబోలె దేవర సౌలభ్యాతిశయ కృపచే స్వరూపోపాయ పురుషార్థంబు

తెరింగి శ్రీమహాభాగవతుల దాస్యానువర్తుండనై యున్నవాఁడ॥ నమోనమో॥ ౧౮

పొగడపుష్పాభరణా! యీలోకంబున బరకాంత సంగమంబు చేసినవారిని యమలోకంబున యమభటులచేత గొండపొడవున గాలాగ్ని గావించి కొలిమితిత్తులతో నూది కాచిన యినుప బొమ్మల నాలింగనంబు చేయింతురట పరద్రవ్యాపహారంబుచేసిన వారిని కుక్షిశూలంబులం బొడిచి తన్మాంస రుధిరంబులు శునకశార్దూలంబులచే గరిపించి తినిపింతురట పరనింద పరదూషణలు చేసినవారల ముఖంబున నుడికెడు సీసంబును తప్తతైలంబునుబోసి వేల్తురట పరపీడనంబు చేసినవారల శరీరంబులందు వజ్రదండ పురుగులును తొలిచియు నినుపముక్కుల కాకులు పొడిచి భక్షించియు బాధింతురట అనృతంబు లాడిన జిహ్వలు ఛేదించి కొత్తసున్నంబు నోట గొట్టుదురట యిది మొదలయిన పాతకోప పాతకంబులు చేసినవారల నిరువదియెనిమిదివేల సంఖ్యలు గల మహా రౌరవాది నరకంబులం గల నరకంబులం బడద్రోచి నొప్పింతురట యివియన్ని యఘోరంబులడియని చేత జేయంబడినవే అయిననుబిమ్మట నేజేయు భాగ్యంబున దేవర కృపచేత మీకు శరణాగతుండైనందున నాచేత బ్రపత్తి చేయించిన కారణంబున నడియెని పరుసంబు సోకిన లోహంబు బంగారంబయినట్లు పవిత్రుండనైతి. నయినను నింకొక భయంబుదోచె భాగవతాపచారంబు బ్రహ్మకల్పంబులకైన ననుభవించినం దీరదనియును పెద్దలవలన వినియుండు వాఁడ పూర్వవాసనా వశంబున నవి సేయకమానుట దుస్తరంబు

ఇట్టి దురాత్ముండనని మరుగువెట్టక దేవర సన్నిధిని విన్నపంబు జేసితి గాన భ్రమరంబు కీటకంబుం బట్టి విడువక తన స్వరూపంబు జేసికొనుసుమీ ॥నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥

కేతకీకుసుమ మాలికాధరా! సంసారతాపత్రయ తప్తమానసుండ నైనవాఁడ మాంగాంవాదులతో సహవాసంబు చేసిన నెండమావులచే నుదకంబువంటివారు అదిగాక శైవపాషండులతో సాంగత్యంబు జేసిన బట్టబయలున మహేంద్రజాల విద్యవాఁడు చూపిన న్యాయంబున గొంతదడవు కనుబడు జలంబులో దాగినట్లు అట్లుగాదని శాక్తేయులవెంటం గదిసిన నోరుదెరిచికొని యాకాశంబున నుండి బడు తుషారబిందువులు దాగినట్లు చార్వాకుల శాస్త్రంబులు అంధకారబంధురంబైన నూతిలో గానరాని నీరుదాగి కడుపు నిండించుకొన్నట్లు అది గాదని బౌద్ధుల విచారంబుచేయ బరస్థలంబుల బాసియంబు లేక దేహంబునం గలమూత్రపానంబుచేయు చందంబయ్యె నివియన్నియు విడిచి చంద్రసూర్యాగ్ని యింద్రాది దిక్పాలనోపాసకులయిన కర్మకాండానువర్తనుల జేరి నొక్కొక్క దేవతోపాసనాఫలంబుచే నొక్కొక్క బొట్టుగా దడిగుడ్డనుండి బడు బిందువులంబోలె నివియన్నియు విచారించ నొకట తృప్తిబొందదయ్యెగదా యని శ్రీవైష్ణవ మహాభాగవతుల నాశ్రయించి వారి దాసుండనైన మాత్రమునసే శఠజిద్విగ్రహాయతి రాజవర వరమునుల చేరింగోలున సమాశ్రయణుంజేసి సత్సంప్రదాయ మంత్రమంత్రార్థం బొసంగి దురాయాసంబు గాక సాన్నిధ్యంబునం గల శ్రీపాదతీర్థతళియ ప్రసాదంబు లభించికొని భగవత్కల్యా

ణగుణామృత పానంబుచే దృప్తిచెంది యానందాబ్ధిని సుఖించి నాడ భాగవత సహవాసంబున గదా యడియెనికి దరుణోపాయంబు గలిగె ॥నమోనమో॥ ౨౦

శరణాగతరక్షకా! అడియెని ధూర్తరక్షణంబు లెంతని యెంతు దేవరవారు మహోపకారులని తలంతు నేమని యంటిరా యనంతకాలంబుననుండి భగవ దనంతావతారంబుల నతనికి దొరకనైతి ఋషభ దత్తాత్రేయ కపిలవ్యాసాది ఋష్యావతారంబులం బడనైతి త్రిలోకసంచారియైన నారదబోధకుం దప్పితి శ్రీరామావతారంబున దిరు వయోధ్యయందైన పరవాసస్థలంబునందైన స్థావరజన్మంబుచే నైన బుట్టనైతి శ్రీకృష్ణావతారంబున బృందావనమందు నైన ద్వారకావాసంబున నైన గోగణ గోపిక గోపాలజన్మంబు లెత్తక తత్సేవకుం బాసితి దేవరవు తింత్రిణీవృక్షమున నుండి మధురకవినాథముసు లాదియైన వారి రక్షింపుచో దత్కటాక్షంబును బొందనైతి స్వాములు భాష్యకారావతారంబై భూప్రదక్షిణంబు చేసినచోటనైన గంచి శ్రీరంగాదిస్థలంబులనైన నగుపడక తప్పించుకొంటిగదా తరువాత వరవరమునుల యవతారంబున సమస్త చేతనుల రక్షించుచోటనే నెక్కడ నుంటినోగదా మరియును బరవస్తుజియ్యరు ఎంబెరుమానారుజియ్యరు మొదలైన స్వాముల కృపకుందప్పి యిట్టి దూర్తవైన యడియెని వెంబడివచ్చి పట్టుకొని దాసునిగా నేలుకొని రక్షించితిరి. దేవరవారి పంతంబుజెల్లె. నడియెని కౌటిల్యంబువాసె. నెంతగాలంబున కెంతకాలంబు ఎక్కడికెక్కడ అహా

యడియెని భాగ్యంబును దేవరవారి మహోపకారంబును దలంచి సంతోషించి యుప్పొంగెద॥ నమో॥ ౨౧

కురుకాపురి నాయకా! భగన్మాయా ప్రభావంబేమని వర్ణించవచ్చు. వత్సాపహారంబుచేసిన బ్రహ్మదేవుండు వెరపించ వచ్చి వెఱచినట్లు భంగపడియె. విష్ణుని స్త్రీరూపంబును జూడ వచ్చిన రుద్రుండు మాయామోహితుండై తనకాంత చూచి నవ్వగ సిగ్గుబడి చనియె నింద్రుడు యోని కాసించిన నిజశరీరం బున బెక్కు యోనులుం గలిగె యక్షకిన్నర గరుడ గంధర్వ సిద్ధవిద్యాధర సురనరాదులు సూత్రిగానిచేతి ప్రతిమలు వలె నాడుచున్నారు నారదుండు విష్ణుమాయ దెలిసితి నని గర్వించి స్త్రీయై యరువదికొడుకులం గనియె మార్కండేయుడు తపంబు జేసి మాయ దెలిసెద నని వరంబు వడసి యనేకకాలం బేకార్ణ వంబున మునింగి భగవద్గర్భంబున విహరించె విశ్వామిత్ర పరా శర శాండిల్యాది మహాఋషు లనేకులు వ్రతభ్రష్టులై తపో విఘ్నంబు నొందిరి. యిట్టి మాయలం దగులువడక భగవత్క ల్యాణగుణామృతం బనుభవించి తిదామృతశేషంబు దాసులకు గృపజేయుచున్న దేవర మహాత్మ్యం బేమని వర్ణింప శక్యంబు ॥నమోనమో॥ ౨౨

లక్ష్మీనారాయణ ధ్యానపారాయణా! శాంతసమద మాద్యనంత కళ్యాణగుణగణ పరిపూర్ణోదయా దయాదాక్షిణ్య కరుణాకటాక్ష వీక్షణాలంకారా శఠకోపవాఙ్మయ ద్రవిడోప నిషదర్థసార సంగ్రహణచాతుర్యనాథ యామునాది పూర్వా

చార్య విహారమార్గ సంచారా యతిరాజ చంద్రపదాంబుజ ద్వంద మకరందమిళిందాయమాన మానస పానమత్తమధుకరా భగవద్విషయ శ్రీవచన భూషణ శ్రీభాష్యసూత్రాంతాది దర్శన సాంప్రదాయ గ్రంథవాఖ్యాన వైభవోల్లాస దురంధరా మణవాళ మహాముని పాదపంకజ ధ్యానామృతసాగర సంపూర్ణోత్తుంగ తరంగ చంద్రోదయా శ్రీశైలాన్వయపావనా పాషండమత్తవేదండచండ కంఠీరవా చార్వాకశైలపక్షక్షిప్త వజ్రాయుధా బౌద్ధధ్వాంత నిరాసనా పరదివాకరా జైనీకమతద్రుమనుండ దావదహనా మాయావాదభుజంగభంగ గరుడస్వరూపా బహువిధ కుమతప్రతాపాది మేఘపటలజంఝూ మారుతా యాదవ భట్టప్రభాకర దుర్మతవిధ్వంసనా కపిలనారదవాల్మీక వశిష్ఠ ఋషభ దత్తాత్రేయ పరాశరవ్యాసాది భాగవతోల్లాస సంపాదకా తత్వత్రయరహస్యత్రయస్వరూపోపాయపురుషార్థనిర్ణేతా అర్థపఞ్చకాకార త్రియహితోపదేశసంపన్నా భాగవత ముఖ పద్మవికాసభాస్కరా జయజయ శేషావతారా దేవరదివ్య తిరువడిత్తామరలకు ననంతమంగళాశాసనంబులు చేసెద॥ న॥ ౨౩

ప్రతివాదిభయంకరా! ప్రసన్నులైనవారు పంచేంద్రియంబుల వ్యాపారంబు లుడుగవలయు నండ్రు అవి మానుటెట్లు నాకన్నుల జూపులు పరకాంతలం గనిన జ్వలనంబు పయింబడు శలభంబుంబోలి గాలుచున్నవి నావీనులు గానంబు గోరి వేటకాని ఘంటానాదంబులకుం జేరు హరిణంబులబోలె నురుకుచున్నవి నానాసికంబు పరిమళాసక్తంజేసి సంపెంగకుం జేరిన బంభరంబునుం బోలె దివురుచున్నది నేనెక్కడ బరమ

పదం బెక్కడ? దేవరవు కృపామాత్రప్రసన్నులై కూర్చుకో వలయునుగాని నీగుణంబు లిట్లుండ నే నెట్లు గాచెదనంటిరా? కూపసమీపంబున నాడు బాలుని తల్లి గనిపెట్టి గాచినట్లు పెట్టిన పయిరునకు నీరుకట్టి ఫలమందు పర్యంతంబు హాలికుండు గాపాడినట్లు అడియని జెడకుండ గాచి రక్షించుకొను కర్తలు దేవరవారేగదా॥నమోనమో॥ ౨౮

కరుణాపయోనిధీ! పరాత్పరుడైన పరవాసుదేవుని విడిచి అన్యదైవంబులం గొలుచుట దప్పిగొన్నవాడు ముందరనున్న గంగను విడిచి కూపోదకంబు పానంబుజేసినట్లు; అట్టి యీశ్వరునికి శేషంబై జ్ఞానస్వరూపంబైన యీయాత్మాత్మీయంబులు అన్యశేషంబుచేయుట దేవతాయోగ్యంబైన యజ్ఞపురోడాశంబు శునకంబుపాలు చేసినట్లు; అతిసులభోపాయంబైన ప్రపత్త్యుపాయంబు దెలిసి పట్టజాలక యన్యశాస్త్రంబుల నమ్మి తరించెదనుట దృఢబంధంబగు కర్ణధార నిపుణంబైన యోడగాదని చేయీతల సముద్రంబు దాటెదనుట మహామనోహరంబైన యానందకరం బొసంగు శ్రియఃపతి పదపద్మంబుల కైంకర్యంబు రుచియింపక యన్యదేవతారాధనలం దపేక్షించుట గృహంబుననున్న కామధేనువు క్షీరంబునం గోరలక అస్పృష్టదుగ్ధంబు మాధుర్యం బని కోరునటుల; ఆత్మవిరోధులయి స్వాహంకార మమకారంబులు వదలజాలక దేహవిరోధులం గెలిచెదననుట సంసారగహనమార్గంబునం జను పథికుండు తన్ను బడనేయు ధనుర్బాణంబులు పూని పొంచియున్న చోరులం దెలియక దూరంబుననున్న పగతులం జంపెదననుట అజ్ఞానంబుచే

బహుప్రియులవంటి యస్మదాదులకు నిట్టి యర్థంబులం దెలిపి సుజ్ఞానులంజేసి యేలుకొను దేవరవంటి యస్మదాచార్యుల సన్నిధి నాశ్రయించనేరక కుమతిమార్గులైన గురువులజేరుట హస్తగతంబైన చింతామణి రత్నంబు చేజార విడిచి యస్థలంబుల చిదుపరాళ్ళకుం జనుట యని యెఱుంగవలయు స్వామీ॥ ౨౫

అనంతకళ్యాణగుణ! సర్వరక్షకుండైన సర్వేశ్వరుం డుండ మమ్ముల నేల పట్టెద వని యంటిరా? యతం డవాప్తసమస్త పరిపూర్ణుండు. నే నేమి సమర్పించెద; నర్ఘ్యంబు సమర్పించెద నంటినా, యత డున్న స్థలంబు క్షీరసాగరంబు; అదియును సమర్పించెదు నర్ఘ్యం బేపాటి? పాద్యం బొసంగి సంతోషపెట్టెద నంటినా, అతని తిరువడిగళ్లయందు గంగోత్పత్తియయ్యె; నే నిచ్చు పాద్యం బేపాటి? పుష్పాలంకారంబు జేసి యానందింపించెద నంటినా, జగన్నిర్మాణకర్తయగు బ్రహ్మ జన్మించిన తామరపువ్వవంటి బొడ్డుగలస్వామికి దాసుండను సమర్పించు పుష్పం బెంతపాటి? తత్సన్నిధియందు దీపంబులు పెట్టి యారాధించెద నంటినా, యనంతకోటితేజస్సు గల సూర్యచంద్రాదు లతనికి నేత్రంబులై యుండ సిద్ధ్యయ్యేదు. నైవేద్యంబు సమర్పించి యారగింపు చేసెదనంటినా, పాలసముద్రంబున నమృతంబు గల్పించి సమస్త దేవతల దృప్తిపరచిన యట్టిమహాత్మునకు నే నేమి యొసంగగల? ఒక్క కానుక ముందరనుంచి ముదం బొనరించెదనంటినా, శ్రీమహాలక్ష్మి వక్షస్థలంబున నివాసయై యుండ నట్టి లక్ష్మీనారాయణున కిది యేమి లెక్క? స్తోత్రంబులచేత నానందింపజేసెద నంటినా వేదంబులును బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు నుతియిం

పంజాలరట; నేనిధంబుచేతనైన నొక్క కైంకర్యంబుజేసి సన్నిధి జేరెద నంటినా, యనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరి పరిచారికావర్గంబులు తత్సన్నిధిం బాయక యున్నవారు. గంపంత ముత్యంబు ముక్కునం జెక్కనంబెట్ట శక్యంబు గాదు. కాన 'నాచార్యో హరిస్సాక్షా' త్తను ప్రమాణంబు పెద్దలవలన నెఱింగి యెట్టి పాపాత్ములైన పావనునిజేసి రక్షించు కర్తలు గాన దేవరవు దోషభోగ్యుండ వని విని దేవర తిరువడిగళాశ్రయించి నంతట శ్రీపాదతీర్థతళియ ప్రసాదంబు లభించె. భాగవతుల దాసానుదాసదాసుండనై యున్నవాడ ॥నమోనమో శ్రీశఠకోప॥ ౧౮

భాగవతముఖపద్మవికాసభాస్కరా! నాయజ్ఞానముచేత పలికితిగాని యఖండమండల వ్యాప్యవ్యాపకావాప్త సమస్త కాముండైన శ్రియఃపతిభక్తసులభుండేగదా! అది యెట్లంటిరా, శేషావతారంబున సత్యవ్రతుండను రాజు దోసెడు జలంబర్ఘ్యంబు బొసంగినం గైకొనియె. శ్రీరామావతారంబున దండకారణ్య ఋషులు కందమూలాదిఫలంబు బొసంగిన బ్రీతిచే గొనియె. శబరిచేసిన యారగింపున దృప్తుండయ్యె. దరుమాపకంబులు భూరేణువులంబొరలి సేతువుపై నొడళ్లుజాడించిన సంతసించి రక్షించె. విభీషణుం డంజలిచేసిన మాత్రంబున నభయంబొసంగె. కృష్ణావతారంబున యజ్ఞపత్నులు సమర్పించిన దధ్యోన్నంబు భుజియించె. కుబ్జయిచ్చిన సుగంధంబు లందుకొనియె. మాలాకారుం డొసంగిన పుష్పంబులు ముడిచె. కుచేలునిచేతి యటుకు లారగించె విదురునియింట విందారగించె.

మహాత్ముల నాదరనేనియు మన్నించె. నతనివలన గొదువలేదు. నామనంబు జలంబునం దేలియాడు కీటకంబు తెఱంగున నుడి బడి విషయాంతరంబులం జిక్కితిగాని భక్తిపురస్సరంబుగ సేవిం చనైతి. అట్లుగావున బ్రత్యక్ష సాక్షాత్కారంబైన దేవరసన్నిధి నాశ్రయించిన మాత్రననే పురుషకారవైభవంబున నడియని నేలుకొంటిరి॥నమో॥ ౨౭

పరవాదిప్రభంజనా! సర్వజగంబులు దైవాధీనంబులు. అట్టిదైవంబు మంత్రాధీనంబు. అట్టి మంత్రం బాచార్యాధీనంబు. అట్లుగావున నాచార్యుడు కృపచేసిన మంత్రంబు భక్తియుక్తం జేయుమంత్రము ఫలించ నీశ్వరుండు చేజిక్కు; నీశ్వరుడుచే జిక్కినమాత్రన నుభయవిభూతులు హస్తగతంబండ్రు గావున నిన్నిటికి మూలంబు భాగవతపురుషకారంబు. తద్భాగవతా చార్యులలోన దేవరలు సర్వోత్కృష్టులు. దాసులలోన నడియని సర్వనికృష్టుండను. ఈ సంబంధంబు మనయందేకాని యితర దర్శనంబునందు లేదు. అదిగాన విన్నవించెద. చిత్తగించి మీసా మ్మయిన యడియని మీ రెచట నేమరకుండ రక్షించుకోవల యును సుమీ॥నమోనమో॥ ౨౮

భృత్యమోక్షఫలప్రదాయకా! జన్మాంతరంబుల నేను న్న చందంబు దలంచిన వికలప్రశస్తకేశ వస్త్రంబులతో పరు విడు నధికుండు పారిపోవం దండధరులు దగులుకొనిన చందంబున కాలభక్షితంబైన ఆయువు విచారించిన పెనువేసంగి నింకు చిరు తమడువుజలంబుపోలిక మృత్యువునుం దలంచిన పాము పడిగ

నీడనున్న కప్ప తెఱంగున జముడు కింకరమార్గమున రౌరవాది నరకంబులం బడ ద్రోచి దేహంబు తప్తాగ్నినిం బడవైచె. మాతృ గర్భ నరకం బూహాచేసితినా, అవయవంబు లురులందగిలి కదల మెదలరాని పతంగంబుమాడ్కి నయ్యె. ప్రసూతివేదనంబులం దలంచిన కనకంపుముద్ద నచ్చున లాగినట్టు లయ్యె; నిన్ని యవస్థ లం జిక్కి యీ జన్మంబున శ్రీయఃపతినిం దలంచిన బంధ మోక్షంబులకు బొత్తైనవారు గావున సంశయంబు జనియింపు చున్నది. పెరియపిరాట్టియారు పురుషకారవై భవంబు దలం చిన మనంబున నూరడిల్లె దేవర సామర్థ్యంబు మనంబున బొరిన పరవాసుదేవ పరమపదంబులు పెరటిచెట్టై యున్నది చెంత నున్న భాగ్యంబు బోవనేర్చునే॥నమోనమో శ్రీ శఠకోప॥ ౨౯

ఈషణత్రయఖండనా! యీ ప్రపంచంబున కామినీ కాముకులు గానివారు లేరు. ఎట్లనిన బ్రహ్మదేవుండు ఒక్క యోని కాశించి కూతురయిన భారతితో గాపురము సేయు చున్నవాడు. శివుడు విష్ణుమాయచే మోహినివెంటం దవిలి జగంబెల్ల గలయందిరిగె, ఇంద్రుం డొక్క యోని కాశించి శరీ రంబునం బెక్కు యోనులం బడసె. చంద్రుడు గురుపత్నితో సంగమంబు జేసె. సూర్యుండు స్వదారసంయోగమునకై యశ్వ రూపంబుదాల్చె. బృహస్పతి పూర్ణగర్భిణితో రమించె. బుధుండు ధాన్యమాలిక యను రాజకన్యాసంగమంబున బురూరవుం గనియె. విశ్వామిత్రుండు మేనకతో విహరించె. పరాశరుడు మత్స్యగంధితో గవిసె. శాండిల్యమహాముని వ్రతభ్రష్టుండయ్యె.

ఋశ్యశృంగుండు వేశ్యలకు లోనయ్యె. కణ్వమహాముని కథ లాశ్చర్యకరంబులు. హిరణ్యకశ్యప రావణ కంస బల సైంధవాది క్రూరుల జెప్పనేల? సిద్ధ విద్యాధర కిన్నర కింపురుష గరుడ గంధర్వ యక్ష రాక్షస సుర నర జంతుజాలాదులు స్త్రీ మోహితులై విహరింపుచున్నవారు. అతినీచుండను పశుతుల్యుండనైన యడియని చేష్టితంబు లనతంబులు. ఇట్టి మాయాభ్రామికంబుల బడకుండ శుకభీష్మాంజనేయధ్రువాదుల తుల్యులై యాచార్య గణ్యులైరి. దేవరతిరువడిగళసంబంధంబుచే నడియని పవిత్రుండనైతి. అదియెట్లంటిరా, మలయాచలంబుననున్న మ్రాకులన్నియు గంధయుక్తంబులయ్యె. సంపంగికుసుమ తైలంబు వాసనతో నున్నట్లు తేలినవారి దాసానదాసుల గోష్ఠిసహవాసంబున గదా దేవరకృపకు బాత్రుండనై యడియని దోష బులుం బాసి నిర్మలుండ నైతి॥ నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥౩౦

చింతతోనులో వసియించియున్న తండ్రి! అడియని దుర్గుణంబులు దేవరసన్నిధిని నెవ్వరేమని విన్నపంబు సేయుదురో? నాదుర్గుణంబు లెల్ల నేనే విన్నపంబులు చేసెద. సత్యంత దరిద్రుండను. కామకలుషుండ. క్రోధశరీరుండ. పెనులోభిని. మదమాత్సర్యచిత్తుండ. మందబుద్ధి గలవాండ. పరకాంతా సక్తుండ పాపిష్టాగ్రేసరుండ. పరనిందా పరుండను. సాధుజన బాధితుండ. కర్మదూరుండ. అనంత వికారంబులం బొరలుచున్న వాడను. ప్రపత్త్యుపాయం బెరుంగని పామరుండ. భాగవత దూషకుండ బద్ధసంసారుండ. పతితుండ. భక్తిరహితుండ. అజ్ఞానవృత్తుండ. సహస్రాపరాధుండ. ఆచార్య సేవాదూరుండ.

పురుషకారోపకారం బెఱుంగని తుచ్ఛుండ. షడ్వికారాదులం బొరలుచున్నవాఁడ. ఆత్మధర్మంబు లేశమాత్రంబయిన నెఱుంగని నీచుండ. శరీరాభిమానినై శేషత్వ పారతంత్ర్య కైంకర్య రుచు లెఱుంగని చండాలుండ. ఆకారత్రయార్థ పంచకజ్ఞాన శూన్యుండ. ఆళ్వారుల వైభవోన్నతులు దెలిసి యానందించని యగతికుండను. దేవరవు దయాసాగరుండవు. దాక్షిణ్యహృదయారవిందుండవు. దాసజన వత్సలుండవు. దోషభోగ్యుండవు. శరణాగత రక్షకుండవు. కావున గత్యంతర విహీనుండనైన యడియనిని చేపట్టి రక్షించి యేలుకొనుటే బిరుదుసుమీ॥ నమో నమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ 30

నాథనాయకీనందనా! సర్వాంతర్యామియైన శ్రియఃపతి దేవరదాసానుదాసుల కతిసులభుండు. మీరక్షకత్వంబు భయవిభూతిం జెల్లుబడి సింహాసనసంభవుండైన యంబరీషుని వ్రతభంగంబు సేయం బూనిన దూర్వాసుండు చక్రానలంబున కోర్వంజాలక జగంబులెల్లం దిరిగి మగిడి యంబరీషునిచే బ్రతికి చనియె. పవిత్రమైన గోదావరి శ్రీరామావతారంబున శబరి స్నానజల సంగమంబున పవిత్రంబయ్యె. తనయందు స్నానముచేయువారి దోషంబులు తన్నంటునని భూలోకంబునకు రానని మాఱొత్తిన గంగానది శ్రీహరి భక్తస్పర్శనంబున దత్పాపంబు వోయి పుణ్యంబులు ప్రాప్తించు రమ్మనిన సమ్మతించి గంగ వచ్చె. సంబెరుమాళ్లు తిరుప్పాణాళ్వారుల శ్రీలోకసారంగుల భుజంబుమీఁద నెక్కించి రావించె. మఱియు ననేకచోట్లను శ్రియఃపతి తమదాసులకు దాను కింకరుండై వర్తించె. అట్లు

గాన భగవదవతారంబైన దేవరవు కృపపెట్టిన నేనెంత పాపాత్ముండనైన బవిత్రుండ నగుదు. నీ వనుష్ఠానసంపత్తిలేక మాకృప కెట్లు పవిత్రుండ వయ్యెదవనిన సార్వభౌముండైన రాజు భిక్షుచేసినవానిని చేపట్టి తనంతవానినిగా జేయు నందురు. మఱియు రాజుపట్టినదే రంభయను సామితయు గలదు. గావున దేవరవే రక్షింపవలయును॥నమో॥ 32

నిర్వికారా! నిర్మలజ్ఞానపూర్ణచంద్రోదయా! నామనంబను నాలవాలంబున మన్మథుండనియెడు కిరాతకుండు క్రోధంబనియెడు ముష్టివిత్తనము నాటి లోభంబనియెడు మూలంబు బలసి మోహంబు లనియెడు స్కంధంబులుగలిగి మదమాత్సర్యచిత్తంబులనియెడు శాఖోపశాఖంబులు ప్రబలంబయ్యె. దురాశలనియెడు భేదంబులు చిగిరించె. అహంకార మమకారంబు లనియెడు త్వక్కులు బలిసె కోరిక లనియెడు పువ్వులు పూచె. పాపంబు లనియెడు ఫలంబు దట్టంబయ్యె. నరకంబులనియెడు ఫలరసం బనుభవించయోగ్యంబై యున్నది. దేవరకృప యనియెడు నళికునింబట్టి దాససంగతు లనియెడు కుఠారంబున దత్తరువును దుత్తునియలుగా నరికించి మనంబు సన్మార్గహాలంబునందున్నించి వైరాగ్యం బనియెడు రాజనం బలికించి మీాశ్రీపాదతీర్థం బనియెడు నీరుకట్టించి తళిగప్రసాదం బను పంటపండించి యామునత్రయంబులపై నాశలను కోతగోయించి స్థూలదేహం బనువుత్తోడ బాపి సూక్ష్మదేహంబున తనువూడ శోధించి జీవాత్మ యిష్టకైంకర్యంబులకు బక్వంబులు చేయించుకొని సుఖం బనుభవింపజేయవే ॥నమోనమో॥ 33

శ్రీమతే రామానుజా! ఉడయనంగకుమారా! అడియెని భాగ్యం బేమని పొగడెద. విష్ణు వాసుదేవ నారాయణ నామంబులు స్మరింపబూనిన శఠకోప రామానుజ వరవరాది నామంబులు స్మారకం బయ్యెడు. భగవద్విగ్రహంబు ధ్యానంబు సేయంబూనిన దేవర దివ్యమంగళవిగ్రహంబు ధ్యానగోచరంబయ్యెడు. శ్రియఃపతి ప్రహ్లాదునితో సంభాషించుట యెరింగి వచ్చెడు నారాయణుండు రాక్షసుల జయించి దేవతలగాచుట తలంచిన మీరు ప్రయాణకర్త బాణంబుల పరవాదులం దోలి స్వమతస్థాపనంబు సేయుట తలపెయ్యెడు వాసుదేవుండు అమృతాంభోరాశి దచ్చి సురల కమృతంబు పంచుట యూహించిన దేవరవు స్వరూపగ్రంథామృతసాగరంబు శోధించి దాసులకు దత్సారసామృతంబు కృపచేయుట యూహింపబడెడు. శ్రీపురుషోత్తమము శ్రీరంగము కంచి వేంకటాచలంబులు దర్శింప నుత్సహించిన శ్రీకాకులంబుచేరి స్వామిని దర్శింప నుత్సాహంబు పుట్టుచున్నది. ఈరీతి పరాత్పరుని వర్తనంబులలో బెన్నిధియైన దేవరచారిత్రంబులు నడియని మనంబు సంతోషించుచున్నది. పురుపురదోలచగా నక్షరంబైనయట్లు అడియని గుణంబు లెల్లయెన్నో కాలేదో ప్రథమనిష్ఠ వదలించి చరమనిష్ఠకు దెచ్చి యడియనిని రక్షింపబూనిన దేవరకటాక్షంబు గాబోలు॥ నమోనమో॥ 38

శ్రీవైష్ణవశిఖామణీ! బుద్ధిహీనులునై కర్మంబులుచేసి తరించెద మను మూఢాత్ముల నేమిచెప్పెడిని! శతక్రతువులంజేసి యింద్రపదం బనుభవింపుచున్న నహుషుండు గర్వంబున

ఋషుల నవమానంబుచేసి యజగర రూపంబునుం బొందె. తత్పుత్రుండైన యయాతి సర్వధర్మంబులు తా నాచరించి దేవేంద్రునిసరిగఁ గూర్చుండి యహంకారంబున పెద్దల నిరాకరించి తన్ను భూషించుకొన్న దోషంబున నాకంబునెడల ద్రోయంబడియె. ఉపరిచరవసువు తపంబుచేసి దివంబునకు బోవుచు నచ్చుచుండి పక్షపాతంబాడిన దురితంబున విమానంబుతో నేలంగూలె. పరశురాముండును సకల రసాతలంబున సత్పాత్రదానంబుచేసి బ్రాహ్మణులచే నెడల ద్రోయంబడి మహేంద్ర పర్వతంబున నుండె. నృగుచక్రవర్తి దినదినంబును సహస్ర గోదానంబులుచేసి తుదను నూసరవెల్లియై పుట్టె. మఱియును తపోవిఘ్నంబుల నిర్ద్వంద్వులైన జెడిరి. అట్టివారల జెప్పనేల? ఇన్ని చేట్లకు మూలంబైన యహంకార మమకారంబులు విసర్జించి భాగవత సహవాసంబున దేవరవంటి దేశికోత్తములజేరి యాశ్రయించి తదుపదేశంబున సంసార సాగరంబును గోష్పదంబును బోలె దాటి పరిజయుతరించి కైంకర్య సామ్రాజ్య పట్టంబను భవింతురే॥ నమోనమో॥ ౩౫

శమదమాద్యనంతగుణ సంపన్నా! కొందరు దురాత్ములు వేషభాషలు నేర్చుకొని వైష్ణవులమని వైష్ణవులలోగలిసి భాగవతనిష్ఠ నెఱుగలేక దూష్యంబుజేయుచు నశింతురు. అదెట్లంటిరా? సీతాపహరణంబు సేయంబూని రావణుండు సన్యసించి మృత్యువశుండయ్యె. సంజీవిదెచ్చు సమయంబున విఘ్నంబు సేయంబూనిన కాలనేమి తపస్వియై హతుండయ్యె. విష్ణులాంఛనంబులు పైబెట్టుకొని వాసుదేవ రూపధారుండైన పౌండ్రకుండు

పాడయ్యె. అమృతార్థులై దేవతల వేషంబు పైవేసికొన్న రాహుకేతువులు తల గొట్టంబడిరి. కృష్ణవధార్థంబు పూతన బాలింతరాలై వచ్చి చచ్చె. శ్రీహరిద్వేషియై ప్రలంబాసురుండు కపట గోపాలరూపంబు వహించి వారలతో నాడి భగ్నంబయ్యె. శకటరూపంబుదాల్చిన దైత్యుండు దెగటారె. మఱియు కపటవేషంబుదాల్చిన బకాసుర అఘాసుర వత్సాసుర ధేనుకాసుర వృషభాసుర కేశి మొదలయిన రాక్షసులు కూలిరి. అట్లు గావున కపటోపాయంబున వైష్ణవులం గలిసి పిదప దూష్యులయి దగ్ధపటంబుకై వడి నశింతురు. వారిం జెప్ప నేల? ఇన్ని చేట్లకు మూలంబైన దురహంకార పరుండైన యడియని దోషంబులన్నియుం బారద్రోలి యాచార్యాభిమాన నిష్ఠ ఫలింపంజేసి భాగవతులపట్ల నొదిగి వర్తించు పారతంత్ర్య తదీయ శేషత్వము గలవారికి బ్రహ్మాదుల కందరాని పరమ పదంబు కద్దని యేలుకొన్నతండ్రీ॥ నమోనమో॥ ౩౬

కలియుగాది నవతరించిన మహానుభావా! శ్రీయఃపతి శ్రీసూక్తి ప్రభావంబు దలంచిన వెరగయ్యెడు. ఏమిటి కంటిరా! వాల్మీకి 'రామ' యనియెడు రెండక్షరంబులు నుడివి బ్రహ్మర్షి యయ్యె. ఒక్క బ్రాహ్మణుడు భార్యావియోగంబునం బొంది మోహంబున 'హా రామా హా రామా' యని పలవరించి మృతుండైనను వైకుంఠంబు జెందె. ఒక్క మానిని చిలుకనుం బెంచి దానికి మాటలు నేర్పబూని 'రాఘవా రాఘవా' యని పల్క సాలోక్యంబున వసియించె. చిత్రకేతుండను రాజు ద్వాదశాక్షరి యేడు దినంబులు జపియించి దివ్యవిమానారూఢుండై

సిద్ధపదంబున విహరించె. ఖట్వాంగుండు భగవన్నామ స్మరణం బుచే రెండు ఘడియలలో ముక్తుండయ్యె. అజామిళుని చరి త్రంబు లందరికిం దెలిసిన పనియె గదా! ద్రౌపది మానభంగంబు నిలుపుకొనుట, గోవిందనామ ప్రభావంబే కదా! ఒక్కనాడు నారదుండు యమలోకంబునకుం జనగా తద్వీణ నారాయణ నామంబులు పలికిన నా పిసికిచేత యమలోకంబు పాడయ్యె ననిరి. ఇట్లు కొన్ని యుపన్యసించితిమి గాని మీ నామోచ్చా రణంబులచే ముక్తులైనవా రపరిమితులని పురాణంబులచే జెప్పంబడి యున్నవి గదా. ఇట్టి భగవన్నామంబు లంతర్భవించి తత్తాత్పర్యమైన శఠకోప రామానుజ వరవర మునుల నామప్ర భావంబులు వర్ణించు నెట్టి యోగుల భాగ్యంబెంతని వర్ణింప వచ్చు॥ నమోనమో శ్రీశఠకోపదేశికేన్ద్రా॥ 32

విష్వక్సేనాంశసంభవా! ఈ లోకంబున నరులు పుణ్యపాపంబులు గనిపెట్టుటకు భగవదాజ్ఞచొప్పున నున్న సాక్షులు పదునలుగురు వారెవ్వరనగ? పృథివ్యప్తేజోవాయురా కాశంబులయిన పంచ మహాభూతంబులును, సూర్యచంద్రు లును, అహోరాత్రంబులును, ప్రాతస్సాయంసంధ్యలును, కాల పురుషుండు మొదలైనవారు వారివారి హృదయంబుల నుండు ధర్మదేవతయుం గూడి జీవులు చేసిన కృత్యాకృత్యంబులు చిత్రగుప్తునిచే వ్రాయింతురట! మఱియు జీవులాచరించిన పుణ్యపాపంబుల ప్రకారము కాలాంతరమున దగినట్లు ఆ యా ఫలంబులం దుంచి యనుభవింప జేయింతురట! ఇట్టి సాక్షులు మొదలైనవారు దెలుపకమున్నె అడియని వర్తనంబులు దేవర

సన్నిధిలో విన్నపంబులు చేసెద. ఎట్లన్న శేషి శేషసంబంధం బెఱుంగలేక కర్మకింకరంబయిన ప్రకృతివాసనాబద్ధుండైన పాపిష్ఠోత్తముఁడ. భూలోకంబున భారతవర్షంబునం గల మానవులలో నతి పశ్వాదిమమకారంబులం జిక్కి మదోన్మత్తులై చేయు పాపంబులన్నియు నొక్కటైన్ను అస్మద్దోషంబులొక్కటైనను నెన్ని చూచిన నడియని చేసిన పాపంబులు మిక్కిలి భారంబైయుండు అట్టివి నాయందు ననంతంబులుగా గలవు. గాన అవి దేవరసన్నిధిని కానుకగా సమర్పించి శరణుజొచ్చినాఁడ. దేవరలు దోషభోగ్యులు. ఎట్టి పాపాత్ములనైన చేపట్టి రక్షించెడు బిరుదుగల నారాయణులుగదా. అడియనియందు పుత్రవాత్సల్యము నుంచి దేవరదాసానుదాసునిగాఁ జేసి యేలుకొనుఁడీ॥ సమా॥ ౩౮

శ్రీమన్నాథమునిప్రియసఖ! యీపాంచభౌతికమైన కళేబరంబు జలబుద్బుదము వంటిది. దీనియం దనురాగుండనై రక్తమాంసాస్థి చర్మావృతంబైన దని తెలిసియుం దెలియక సౌందర్య యౌవన వయో విశేషానురక్తుండనై యాలింగనాది స్వల్పసుఖానుభవుండనై విద్యోన్మాదాది కలిమియందును సంతకూటమిబోలు సంతానమందును చర్మమాంసపుస్తకలైన స్త్రీలయందును స్వప్నఫలంబునంటి భోగభాగ్య రాజ్యాభిలాష యందును అంబరావృతి విచ్ఛిన్నమేఘంబుమాడ్కి బంధుజాలంబులందును కాలసర్పఫణిచ్ఛాయాగతుండైన మండు కాయమాన్యాదులు స్థిరంబనియును ఋణానుబంధరూప పశుపుత్రమిత్ర కళత్రాదులగు సంసారసాగరతరంగంబులం జిక్కి మమకార

మగ్నులై విరక్తిమార్గంబు దెలియక వలబడ్డ మీను చందంబున నురులం దగులువడ్డ పక్షిచందంబున పంకంబునం గూలిన ధేనువునుం బోలె పరలోకదూరులగువారి కర్మంబు లిట్టివియేయని చెప్పవచ్చు; నిన్నిటం బొరలినవాడను. ఇంక సుజ్ఞానులైనవారు భాగవతులయిన వైష్ణవోత్తముల తిరువడిఘ ళాశ్రయించి కృపచేత వారలు దేవరలం జూప నంతట దేవరవంటి దేశికోత్తముల యండజేరి మీరు చూపిన సిద్ధోపాయ స్వీకారమార్గంబున మోక్షమబ్బె; నిది సత్యంబు సత్యంబు॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౩౯

మధురకవుల మనోరంజితా! యీభూతజాలంబులందు స్థావరంబులకంటె జంగమంబు లెక్కుడు, జంగమాదులకన్న క్రిమికీటాదిజాలం బెక్కువ. ఇందు కెక్కు డండజాలంబులు. వీనికి మిక్కిలి చతుష్పాదమృగంబులు. ఇన్నిటి కుత్తమంబు మానవ జన్మంబు. వీనిలో బుద్ధిమంతులు మేలు. వారిలో రాజ్యపరిపాలనంబు జేయువా రెచ్చు. వారికంటె సిద్ధవిద్యాధర కిన్నర కింపురుషాది దేవతాదులు హెచ్చు వారికన్న సురలు శ్రేష్ఠులు. వారికంటె దక్షప్రజాపతు లుత్కృష్టులు. అంత కన్నను బ్రహ్మరుద్రేంద్రాదులు మహోత్కృష్టులు. వీరల కంటె సర్వోత్కృష్టుడైన సర్వాంతర్యామి యిట్టి పరమకారుణికోత్తముడైన నారాయణుని కవయవతుల్యులైన శ్రీవైష్ణవులైన పరమభాగవతులు అట్టి వైష్ణవులకృపచేత ననంతాత్మ లాచార్యాఘనంబు చేతురు. అట్టి యాచార్యులలో దేవర వాచార్యశిఖామణివి. దేవర సౌశీల్య సౌలభ్యవాత్సల్యాది

కళ్యాణగుణసుధాబ్ధివైభవంబు లేమని వర్ణించువాఁడ. దేవర దాసానదాస దాసుండను. దేవరకృపాఫలం బడియని భాగ్యంబు॥ నమోనమో॥ ౪౦

శ్రీరంగరాజచరణాంబుజ రాజహంసా! నమ్మాళ్వారుల నుండి యామునాచార్య పర్యంతంబు విస్తారంబుచేయక యొకా నొకరికే ప్రసాదించిన యర్థరహస్యంబు తిరుక్కోట్యూరు నంబిగారు తదర్థ గౌరవంబుజూపుటకై పదునెనిమిదిమారులు వ్యథపెట్టి యంబెరుమానారులకు నానతిచ్చిన రహస్యంబేది? ఆయెంబెరుమానారు తమ కంతరంగులైన కూరత్తాళ్వారును మాసోపవాసంబు చేయించి తెలిపిన తత్వంబేది? మొదలి యాండానుచే దాససేవనులు చేయించికొని ప్రయాసంబున సాయించిన పరమార్థంబేది? మాధవుఁడను భాగవతుఁడు గాడిదెల మేప సేడిగెదానియొద్ద శ్రీకృష్ణమూర్తి యిప్పించిన పురుషార్థం బేది? ఇట్టి రహస్యార్థంబు లెఱిఁగి దేవరవు గొప్ప కొంచెంబు లెంచక కులగోత్రంబులు చూడక దేవర దాసానదాసులకు నుడయవరుల పరిత్యామ్నాయావతారంబుగా, భూరిదానంబుగా ప్రసాదించుచుండగా కొందరు దూష్యులు నిందించి నరకంబులం బడిరి. అది యెట్లనిన, అంధకారతిమిరంబు బాయుటకై గృహంబుల తెరువుల దీపంబు పెట్టినప్పుడు కొన్ని మిడతలను జంతువులందు బడి మడిసినయట్లును; కొందరు పుణ్యాత్ములు తటాకంబులు త్రవ్వించిన తత్తోయంబున సమస్తజనులు స్నానపానంబుజేసి సంతోషింప కొందరు మునిగిచచ్చినయట్లును; సద్యోత్తరణంబుకై దోనెను కొందరు ధర్మాత్ములుంచినందున బహు

జనంబుల కనురాగంబై యుండ దుర్మార్గు లారగదొక్కి మృతి బొందిన చందంబున; దురాత్ములయిన దూష్యులు నశింతురు గాదె. దేవరదివ్యతిరువడిగళ సంబంధంబున నడియని కొక కొదువయులేదు॥ నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౪౧

శ్రీమత్పరకాలయతిరాజ వరవరమునీంద్ర పదాంబుజ మకరందపాన మత్తమధుకరమైన భవా! నామనోభ్రమరంబు దేవర శ్రీపాదపద్మ మకరందంబైన శ్రీపాదతీర్థం బపేక్షింపు చున్నది. కీరంబులు ఫలరసాస్వాదంబు గోరినట్లు అడియని జిహ్వాకీరంబులమాడ్కి దేవరతిరుయప్రసాదశేషంబు వాంఛించుచున్నది. చకోరంబులు చంద్రోదయంబున కెదురు చూచినయట్లు నానేత్ర చకోరంబులు భవదీయముఖచంద్ర మండలంబు సేవించ గాచియున్నవి. చక్రవాకంబు సూర్యోదయంబున కపేక్షించునటుల నడియని చిత్తవృత్తు లను చక్రవాకంబులు దేవర దివ్యమంగళసేవకు దివురుచున్నవి. పతి పతియూడిగంబుల కబ్బుచున్నయట్లు అడియని యంతరంగ పతి భక్తమైన దేవరకు కైంకర్యంబులు సేయగోరుచున్నది. మేఘంబు ప్రవాహంబులకు భేకంబు లాసించియున్నట్లు నా చిత్తభేకంబు దేవరకృపాకటాక్షవీక్షణ సాగరోదకంబున కానందించుచున్నది. ఇట్టి యపేక్షాభావంబులు విన్నవించితిగాని యనుభవానందజనకంబున కధికారిని లేనివాడ. కృపామాత్ర ప్రసన్నుండవైన దేవరవు నవవిధసంబంధంబున సన్నిధికి రప్పించుకొని కైంకర్యదాస్యసుఖంబు గలుగజేయుమీ॥ నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౪౨

పెరియజియ్యరు సాంప్రదాయసుధావారాశిసంపూర్ణ చంద్రోదయా! అయోధ్యావాసులు శ్రీరామ వనవాసంబు నపుడు వెంటఁజని సరయూనదీతీరమున రఘుపతిని విడనాడి చని శోకించినట్లు అడియని చిత్తంబు దేవర నెడబాసి దూరంబున నుండుటకు నోర్వజాలకున్నది. శ్రీరాఘవుని వియోగంబు నపుడు భరతుండు జటావల్కలంబులు ధరియించి నంది గ్రామంబున నుండి రాముని రాకకు నిరీక్షించినట్లు నా మనంబు దేవరవారి సేవకు నెదురు చూచుచున్నది. సీతాపిరాట్టియారు రావణాసురునిచేత నపహరింపంబడి రాక్షసాంగనలు పరివృతంబై యశోకవనంబున శోకించినట్లు అడియని జీవుండు దేహబంధులను రాక్షసాంగనలలో జిక్కి విడివడ నుపాయంబు గానక మీ యా వద్యాంధవంబున కాశింపుచున్నవాడను. కంసునిచేత పంపంబడిన యక్రూరుఁడు మధురకుం బోవుచు. శ్రీకృష్ణ సందర్శనం బెట్లబ్బునో యని విచారించినట్లు గోపకుమారులు దివంబెల్ల రాత్రిమై యుండునేని శ్రీకృష్ణుడు మనయెడ విడువక క్రీడింపుచు నుండునని కోరినట్లు నామనోవాక్కాయకరణంబులు దేవరకు కైంకర్యంబు లెల్లప్పుడు సేయంగోరుచున్నవి. ఇది సత్యంబు సత్యంబు. నా యంతరంగంబున వేంచేసియున్న దేవరవే సాక్షిగావున నవవిధసంబంధంబులం దడియని నేలుకొని రక్షింప వలయుజుమీ॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౮౩

తత్వంబు శ్రీనిధితద్దాస్యంబే సిద్ధంబను సారార్థనిర్ణయా! యీ జగంబున కొందరు దురహంకారులు విష్ణుధర్మంబెరుంగక వైష్ణవుల కులగోత్రంబు లంచి దూషించి చెడుదురు గాని

యేవర్ణమైన నే యాశ్రమంబైన వారి వంశంబున నొక్కడు వైష్ణవుడయ్యె నేని వాని పితృపితామహులు సంతోషించి చప్పట్లుగొట్టుచు నీ మహాభాగవతుని వల్లగదా మనకు విష్ణుసాయుజ్యంబు గలిగె నని నృత్యంబులాడుదురనియు నుపనిషత్తులు చాటుచున్నవి. బ్రాహ్మణుండైన గాని శ్రీవైష్ణవుండయిన నుత్కృష్టుం డనియును, వర్ణశ్రేష్ఠుండై జన్మించినవాడైన శ్రీవైష్ణవుండు గాకున్న నపవిత్రుండనియు మహానటుండయిన పరమేశ్వరుండు పార్వతీదేవి కుపన్యసించె శ్రీవిష్ణులాంఛనములు గలిగి శ్రీమన్నారాయణ ధ్యాన పారాయణులై పరతత్వనిర్ణయం బితండే యని పలుకుచున్న పరమభాగవతుల సేవించి యొదిగి వర్తించిరండని యమధర్మరాజు తన భటులకు నాజ్ఞాపించె. శ్రీవైష్ణవులు నాకు స్వాములనియు సుజ్ఞానిత్వాత్మవత్వమే మతంబని భగవద్వాక్యంబు లున్నవి. నశూద్రా భగవద్భక్తా యనిన కర్మజ్ఞాన భక్తి యోగ శ్రేష్ఠుం డగు జనక చక్రవర్తియును నీవే యాశ్రమవర్ణ శ్రీకారుండ వటన్న శ్రీవిష్ణు దాసానదాసుండనని శ్రీ శుకబ్రహ్మ యానతిచ్చెను. పరమ భాగవతులు వైష్ణవధర్మంబుచే మోక్షార్హులనియు లోకంబున చాటింతురు. లోకులను తరింపజేయ నవతరించిన యాచార్యులు భగవద్విగ్రహంబు ఆచార్యో హరి స్సాక్షా చ్చరరూపేన సంశయ యను శ్రీవైష్ణవదర్శనస్పర్శన కటాక్షంబుచే క్రిమికీటకాది పశుపక్షిమృగనరాది జంతుజాలాదు లన్నియు తరించుననియును మరియు బహువిధంబుల వైష్ణవ ప్రభావంబులు శ్రుతిస్మృతేతిహాసాది సాత్విక పురాణగీతాది ప్రమాణంబులచే వ్యాస వసిష్ఠపరా

శఠపుండరీక నారదాది మహర్షులచే చాటించిన యెల్లధర్మంబు లీ కలియుగంబునం దెల్లరకు దెలిసి దాసానదాసునిగా నేలుకొంటిరి. ఇట్టి శ్రీవైష్ణవ దాసానదాసుల కటాక్షపాత్రునింగా జేసి రక్షింప వలయుజుమీ॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ఠఠ

పరతత్వసూత్రవేత్తా! యెవ్వని నాభికమలంబున బ్రహ్మ జన్మించి సృష్టికర్త యయ్యె; నే దేవుని లలాటస్వేదంబున రుద్రుం డుపుట్టి లయకర్త యయ్యె; నేపావనుని పాదంబుల గంగ యుద్భవంబై శివుని మకుటవర్తియై త్రిభువనంబుల బవిత్రంబు చేయుచున్నది; యెమ్మహాత్మునికి చంద్రసూర్యులు కన్నులైరి; ఏవిశ్వరూపుని ముఖంబున ననలంబు వొడమె; నేసర్వేశ్వరుం డాదివరాహమై భూమ్యుద్ధరణంబు చేసె; నేపరమాత్ముని రోమకూపంబున నజాండబ్రహ్మాండకోట్లు వ్రేలాడుచున్నవి. ఏకపటనాటకసూత్రధారి జీవసమూహంబుల కర్మపాశంబులంగట్టి బొమ్మలవలె నాడించుచున్నాడు. ఏమహాపురుషుండు పరంజ్యోతియై తేజోరాశియై వెలుగుచున్నవాడు. ఏదేవుం డేకార్ణవంబున ప్రపంచంబు గర్భంబునం దాలిచి బాలుడై యుండువాడు. ఎయ్యనంతుండు గోబాలపశు నానాజంతు సంఘంబులం దనమాయచే జేసి బ్రహ్మేంద్రాదులకుగల గర్వంబడంచె. ఏలోకేశుని యూరుల సప్తమారుతంబు లుద్భవించె; నేవిశ్వతోముఖుండు సమస్త జీవసంఘహృదయకర్ణికా మధ్యవర్తియై సర్వసాక్షియై వసియించు; నేదివ్యమంగళ విగ్రహుని వక్షస్థలంబున లక్ష్మి నివాసంబై విహరించు; నేయనంతుని వేదవేదాంతంబులు నుతియింపజాలకున్నవి ఏపరమకారుణికుండు

తన నిజకరణంబుల సర్వప్రపంచంబులు వెలుపలలోపలనుంచు కొని జాలంబులాడు చున్నవాడు. ఏభక్తపరాధీనుండు భక్తులకు తానున్నచోటిచ్చె; నట్టి సర్వేశ్వరుని దెలియక దేవతాంతరంబు లం గొలుచు దురాత్మల జముం డడిదంబులం బెట్టి దండించు. దేవరవంటి దేశికోత్తములు దెలుప నిట్టి శ్రియఃపతికి దాసభూతు లయిన వారి దాసానదాసుల పాదరజంబు నాశిరంబున నధి వహించుచున్నవాడను॥నమోనమో॥ ౭౫

నమ్మయాళ్వారే! నే నెత్తిన జన్మంబులు నాకుం దెలి యవు. నే ననుభవించిన నరకంబులు నాడె మఱచితిని. నావి గాని బదార్థంబులపై మమకారంబు వదలదు. నాశరీరం బస్థిరం బని దెలియక కల్పపర్యంతంబుండునట్లుగా నెంచి యున్నవాఁ డను. ఋణానుబంధంబుచేతఁ గలిగిన దేహబంధువులు సత్యంబని తలంచి మోహజాలంబుచే బొరలుచున్నాడ. తా నెవ్వరో తనవా రెవ్వరో యెక్కడనుంచి వచ్చినాగో నే నెక్కడికి బోవం గలవాడనో యనెడి మార్గంబు దెలియక పాశబద్ధుండనై యున్న వాడను. ఎవరికివారే యమునాతీరే యను వార్త పెద్దలవలన నెఱింగియెఱుఁగ. నిమగ్నుడైన మందుడను. పంది బురదలోబడి పొరలు చందంబునం బొరలెద. ఆత్మగుణంబులు దలపోయువేళ నీవణతప్రియంబు లీడ్చుచున్నవి. ఇట్టి యంధకారంబుచే నాయజ్ఞానంబు నన్ను బట్టుకొని వదలదు. ఇట్టి మాయా మోహితుండను. బ్రహ్మరుద్రేంద్రాదులకు నలవిగాని శ్రీమ న్నారాయణుం డెక్కడ, నేనెక్కడ? అందరాని పదంబు లందు కొనుటెట్లు? కుంటివాడు మేడనెక్కుటెట్లు? నిచ్చెన యొకచోట

నుండగా తా నుప్పరిగ నెక్కగలడా! అదిగావున నందిన ఫలంబు చొప్పున భాగవతులొద్ద నుండువారి నాశ్రయించితిగదా దేవర వారి యండజేరితి. దేవరవే రక్షింపవలయుజుమీ॥నమోనమో శ్రీశరణాగతదేశికోత్తమా॥ ౪౬

సూత్రివత్సాంశసంభవా! బ్రహ్మహత్యయు స్వర్ణాపహారంబును సురాపానంబును గురుభామినీ సంగమంబును భాగవతాపచారంబును నివి చేసినవారితో సహవాసంబుచేయుట పంచమహాపాతకం బనంబరగు; నింక నుపపాతకంబు లేవియనిన తృణలతాగుల్మతరుచ్ఛేదనంబులు మొదలుకొని సమస్త జంతువుల వధియించుటయును చలికూడు పులికూడు నెంగిలికూడు దురాన్నంబును అశుచిభక్షణంబు భక్ష్యాభక్షణంబును తోటకాయ చీడికసువుచేసిపంట తస్కరంబు దొడ్డి పెడకట్టు మొదలయిన పరద్రవ్యాపహారంబులును ఋతుకాలంబున స్వస్త్రీ సంగమంబు దప్పించి జారస్త్రీ వారస్త్రీ దాసి మొదలైన పరాంగనల సంగమంబును నివి మొదలైనవి చేసినవారితో జెలిమి చేయుట ఉపపాతకంబు లనంబడు నిట్టి పాతకంబులన్నియు నడియనివల్ల జేయబడినవే. కోసితూచి కాల్చి పేల్చి ముండ్ల ద్రొబ్బించి గశల నడిపించి రువ్వించి మొత్తించి పొడిపించి విషదంష్ట్రల గరిపించి నరకంబులం బడవైచి యిత్యాద్యనుభవంబు లనుభవింపం జేసినగాని బ్రహ్మకల్ప పర్యంతంబునకైన దీరదు. ఇట్టిహింసల కోర్వజాలక భయంబుగల్గి దేవర దాసానదాసుల సేవించి మరుగుజొచ్చితి. అడియనిచేసిన తప్పులెల్లను సన్నిధిని విన్నపంబు జేసినాడ. వీనితప్పులెల్ల దేవర

వొప్పుజేసికొని క్షమించిన ట్లాయెనేని యీశ్వరుండు రక్షించు నడియని కృతార్థుం డౌదుజుమీ॥నమోనమో॥ ౪౭

అజ్ఞానాంధకార భాస్కరా! ఇట్టి పాపంబులు చేసిన వాడవు నీ వెల్లప్రాయశ్చిత్త రూపాదులచే బాపుకొనుమంటిరా? బ్రహ్మహత్యాది పాతకంబులకు తాను వధించినవాని పుఱ్ఱె చేతం బట్టుకొని యందు భిక్షమెత్తి భక్షించి యనేక కాలంబులం గడిపి తీర్థాచరణంబులు చేయుచు నగుపడ్డవారి కెల్లను తద్దురిత వర్తనవి తెలుపుచు బండ్రెండేండ్లుదిరుగక తత్పాపంబు బాయదు. తదుపపాతకంబు లెట్టి వంటిరా? తొల్లి యొకక్షామ కాలంబున సప్త మహాఋషులు ఆకటివేళ వచ్చు నతిథులకు నన్నంబు పెట్టెదనని నేనజిత్తుండనురాజు చెప్పగ రాజద్రవ్యంబుకంటె శరీరత్యాగంబు మేలని తొలంగిరి. కావున శంకకీలితులను వారు తపస్వు లన్నదమ్ములు బాహుదా నదీతీరంబున పర్ణశాలా గృహంబున నుండి యద్దనుజుం డగ్రజు నాశ్రమంబునకు వచ్చి అతడున్నచోట నొక్క ఫలంబు గోసి భక్షించిన నగ్రజుండు చూచి యీదోషంబు యమధర్మరాజు ముందర ఘనంబు గావున రాజదండనచే బాపుకొని రమ్మనిన నతండు సుద్యుమ్నుం డను రాజువల్ల కరంబులు ఖండింపబడి కొంతకాలంబు శ్రమ జెంది తదనంతరంబు బాహుదా నదిలో మునింగిన కరంబులు వచ్చె. దేవేంద్రుం డహల్యాగమనంబున దేహమెల్ల యోనులై బహు ప్రయాసంబున ప్రయాగ మఘస్నానంబు చేసి వేయు కన్నులం జేసికొనియె అడియని యిట్టిలంపటలం బడజాలక గదా దేవర దాసానదాసులకు దాసుండనైతి. దేవరవు గోవత్స

న్యాయంబున నడియుని మాలిన్యంబు భోగ్యంబు జేసికొనవల్లయు జుమీ॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౭౮

దాసదురితవికారదూరా! నామనోచాంచల్యంబుచే పిఱికితనఁబు పై బెట్టుకొంటిగాని దేవరసన్నిధి నాశ్రయించిన నా పాపంబులు దొలంగు నెట్లన్న దేవర దాసానదాసుడనైన కారణంబున సూర్యోదయంబుచే నంధకారబంధురంబు బాసిపోయిన తెఱంగున భాగవతుల యండజేరి వారి కృపగల మాత్రాననే యడియుని దురితంబులెల్ల ననలంబుసోకిన దూదికొండలం బోలె నశించి ఆచార్య తిరువడిగ ళాశ్రయించి శ్రీపాదతీర్థతళియ ప్రసాదంబు స్వీకరించిన వారిదోషంబులు సింహంబు బొడగనిన మత్తగజంబుకరణి మడిసిపోవు. నేనింక నాకృత్యాకృత్యంబులు దలంచి భయంబుజెందుట యేనుగునెక్కి కుక్కలకు భయపడుటగాదె. ఇంక దేవరకటాక్షవీక్షణ కృపచేత సకల భయంబులు దీరి నిర్భయుండనైతి॥ నమోనమో॥ ౭౯

ఇంద్రియనిగ్రహా! జితేంద్రియా! సర్వరక్షకుండయిన యీశ్వరుం డుండగా మమ్మేల పట్టెదవంటిరా, అతనికి ననంత తిరునామములు గలవు. నే నే నామోచ్చారణచేయుదు. అతని యవతారంబులనంతంబులు గలవు. నేనేయవతారంబు గొలుతు. అతని కళ్యాణగుణంబులు గణుతింప బ్రహ్మరుద్రేంద్రాదుల కలవిగావు. వేదంబులు స్తోత్రంబులు చేయఁజాలక శరణు శరణనియె. నే నెట్లు స్తోత్రంబు చేయువాఁడ. అతని చేష్టలు కపట నాటక సూత్రతంత్రబులు. నే నెట్లు గనుంగొనువాడ. అతఁ

డనంతకోటి బ్రహ్మాండంబుల కందక క్రీడావినోదియై యాటలాడు నే నెట్లు సేవించువాడ. అత డజరుద్రశౌనకాదుల కగుబడక యశరీరవాణి చందంబున మాట లిచ్చునట. నాతోడ నెట్లు మాట్లాడు. అతడు మాయచే జీవాత్మపరమాత్మల రూపభేదంబులం దంతట పరిపూర్ణుండై వ్యాప్యవ్యాపకంబుల వర్తించునట. తన్మాయ నే దొలగుటెట్లు? అతడు శ్రీవైకుంఠ నగరంబున నంతఃపురంబున శ్రీభూనీళాది దివ్యమహిషులతో సరససల్లాపము లాడుచుండునట. నా విన్నపంబు లతనితో మనవి చేయు వారెవరు. అతని రక్షకంబులు బంధ మోక్షంబులకు పాత్రట. నే నెట్లు నమ్మువాడ. అట్లుగాన భాగవతాచార్య కటాక్షంబు భాగ్యవశంబున దొరకవలయు గాని దేవరవు దోషిభోగ్యులు దయాదాక్షిణ్య కృపావాత్సల్య సాగరులు కూరత్తాళ్వారును వలె దాస దాసులకెల్ల కొదువలేని పరమపదంబు కృపజేయింతురట. దేవర చిత్తం ఒడియని భాగ్యం బెట్లుచేసిన జేయుము॥ నమోనమో॥ ౫౦

అరిషడ్వర్గాదుల జయించిన స్వామీ! మూర్ఖుండ జడుండ కృతఘ్నుండ దుర్మార్గుండ బతితుండ నా బుద్ధిహీనత్వంబుచే నిట్లుదోచె గాని శ్రియఃపతి కృపావాత్సల్యంబులు దలంచిన తా పరాత్పరుండయ్యును యాదృచ్ఛికానుషంగికాదులచే చేతసకొట్లనెల్ల రక్షించు నిషాదుడైన గుహపెరుమాళ్ళను ప్రహ్లాద విభీషణాది రాక్షస వంశోద్భవులను గజేంద్రుని వానరులయిన సుగ్రీవాంగదాంజనేయులను భల్లూకండైన జాంబవంతునితో దా చెలిమిచేసి రక్షించడె. గోబాలగోపికాజనంబులతో స్నేహించి

యిష్టఫలప్రదుండు గాఁడె. యట్లు గావున సతండు భక్తసుల భుండు. అయినను అడవి నరుకదలంచినవారికి కుఠారంబును, దధికుంభము దరచెడువారికి దృఢబంధంబయిన కవ్వంబును తలుపు తెరవదలంచినవారికి తాళము బీగము లేక కార్యంబు కై వశంబు కాదుగదా! అటువలెనే ముముక్షువులకు భాగవతా చార్యకటాక్షంబు లేక పరమపదంబు లేదు. గావున దేవర తిరు వడిద్దామర లాశ్రయించితి॥నమోనమో శ్రీశఠకోపదేశికో॥ ౫౧

దురితవిదూరా! వరాహపురాణంబునందు కథవిన్నపంబు చేసెద. ఒక పురంబున నొక బ్రాహ్మణుండు శ్రోత్యధ్యయన సంపన్నుండును, ధనికుండును, పుత్రవంతుండునునై వేదాచా రంబు జరుపుచు నతిథిపూజ లాచరింపుచు సద్వర్తనంబులు సల్పుచుండి కొంతకాలంబునకు బిమ్మట గంగాయాత్ర చనిన తద్గృహంబునకు మాధ్యాహ్నకాలంబున నొక్క యతిథి వచ్చి యన్నంబుగోరిన తద్గృహిణి యింట నన్నం బు డియు లేవలేని బద్ధకంబుచే గడిపిన నతిథి చనియె. అంతట బ్రాహ్మణుండు వచ్చి కొన్ని దినంబులు చెల్లినపిమ్మట బరలోకగతుం డయ్యె. ఇం ద్రుం డతనిని స్వర్గసుఖం బనుభవించు మని నియమింప జముండు ముఖంబు ముడిచె నట. అదిచూచి యింద్రుండు యమధర్మ రాజును నేమని యడిగి నంతట నితని భార్య యతిథిపూజ గడిపె. గావున నొకయేడాది నరకం బిత డనుభవింపవలయు. సతిసల్పిన పాపంబు పతి సగం బనుభవింపవలయు గావున నితం డారునెల లయిన నరకం బనుభవించి పిమ్మట జంబుక జన్మం బెత్తి తత్తనువు విడిచిన తదనంతరంబు స్వర్గ సుఖంబనుభవించు ననియెనట. ఆ

ప్రికారము దేవేంద్రుండు జరిపె ననిరి. ఇంక నాబోటి పాపి కెట్లు జరుగునో యను భయంబు గలిగి భాగవతులపంచ జేరి యొదిగి వర్తించి దేవరబంటులబంటునకు బంటనై యాశ్రియించి యున్నాడ॥ నమో నమో శ్రీశఠకోప॥ ౫౨

దాసబృందముఖోల్లాసా! యీ లోకంబున చేతనులు వేదశాస్త్రోల్లంఘనంబు చేసి, కృత్యాకృత్యకరణంబులు చేసి నందుకు నీశ్వరుండు శిక్షింప దలంచినపుడు పిరాట్టి కృపచే హితవార్తలు సాయించినవి విన్నపంబు చేసెద. సర్వేశ్వరా! యపరాధములు దెలిసి యపరాధుని రక్షింపకున్నను దేవరవు దోషభోగ్యుండవు నను వార్తకు కొఱతవచ్చు. వీడు మహాపాపి యని విడిచిన పతితపావనబిరుదుకు హానిగలదు. వీడు భగవదాజ్ఞావిరోధి యని వదలిన ట్లాయెనేని దేవరవాత్సల్యసాగరంబునకు మట్టుపడును. వీడు లేకున్న నేమాయె నన్న మీ స్వామిత్వంబునకు సరిగాదు. వీ డపేక్షించిన పురుషార్థంబు మీ రియ్యకున్నను మీ సౌశీల్యంబునకు జాల దక్కువౌను. వీ డల్పుం డని కైకొనకున్నను మీ సౌలభ్యమునకు బాగుగాదు. వీ డజ్ఞానచండాలుం డని చెయి బట్టకున్నను మీ సర్వజ్ఞత్వమునకు బ్రమాదంబు వచ్చు. వీ డకించనుం డని విడిచిన మీ కీర్తికి భంగంబు వచ్చును. వీడు దుఃఖితుండై యుండగా శీఘ్రమే రక్షింపకున్న మీాద నెక్కువ తక్కువ వచ్చును. వీ డాశ్రియుండు కా డని మీ రూరకున్నను మీ సర్వాశ్రమత్వమునకు లోపంబు వచ్చును. వీ డశరణ్యుం డని రక్షింపకున్నను మీ పతితపావన బిరుదు చెలామణిగాదు. మీ సన్నిధిని విన్నపంబు చేసి ఆశ్రియింపంజేసిన

చేతన సంఘంబుల చేరదీయు మనిన జియ్యమ్మ కృపాపరులుగాదే మీ రెరుఁగని దేమున్నది. దేవరపు రక్షింపవలయు జుమీ॥ నమో నమో శ్రీశఠకోప॥　　౫3

భగవద్విషయకాలక్షేపవిభవా! మీ దాసానదాసులకు దండప్రణామంబులు. మీ దివ్యతిరువడిత్తామరల కనంతంబులైన సేవింపులు. మీ దివ్యమంగళ విగ్రహ సౌందర్యమునకు మంగళంబు. మీదేశికులయిన శ్రీమాఱ శ్రీనివాసాచార్యులకు బహువిధ వందనంబులు. మీవరవరావతారాంశంబునకు మిగుల మొగుడ్పులు. మీ రామానుజమతోద్ధారకత్వంబునకు బల్లాండు పల్లాండు. మీగురుపఙ్క్తి శ్రేష్ఠులైన యామునాచార్యాది శ్రీమన్నాథమునులకు సేవింపులు సేవించెద. మీపూర్వ సహస్రశాఖోపనిషత్సమాగమాది ద్రావిడవేదకర్తలయిన పరాంకుశుల కనంత సాపరాధిని. మీ సేనానాయకుల కొలిఘు. మీ పురుషకార నిత్యానపాయి కెప్పుడు సేవింపులు. మీ సర్వరక్షకత్వ సర్వశేషిత్వ సర్వేశ్వరత్వంబైన శ్రీమన్నారాయణ పరత్వంబునకు బునఃపునశ్శరణార్థి. మీ యారోహణ గురుపరంపర ప్రభావంబులకు బుష్పాంజలి. మీసన్నిధియందు సేవాకాల ద్రావిడామ్నాయపారాయణచేయు భాగవతోత్తముల కనంత సేవింపులు సేవించెద, మీయాదరణీయంబులకు జోహారు. దేవర దాసానదాసులకు దాసుండను. అడియని కృత్యాకరణాకృత్యాకరణ ప్రవృత్తిదోషంబులు దోలి తిరువడిగళయందు కింకరునిగా జేసి రక్షింపవలయు జుమీ॥ నమోనమో శ్రీశఠకోప॥౪౪

అర్థపఞ్చక తత్వజ్ఞానోపదేశా! మీరు జ్ఞానోపదేశ సంపన్నులు, నే నజ్ఞానసంపన్నుడను. మీరు సర్వశక్తుల బరిపూర్ణులు, నేను సర్వవిధాశక్తుండను మీరు, సర్వరక్షకులు, నన్ను నే రక్షించుకొనలేను. మీరు చరమార్థ సంస్థాపనార్థంబుకొరకై యాళ్వారులయంశంబుచే నవతరించిన యాచార్యవిగ్రహంబు, నేను కర్మబద్ధుండనై పుట్టినవాడను. మీరు సమస్తజీవదయాపరులు, నేను సర్వజీవద్వేషిని. మీరు సర్వోత్కృష్టులు, నేను సర్వనికృష్టుండను. మీరు భగవద్భాగవతాచార్యముఖోల్లాసవరులు, నేను వీరల సేవకు విముఖుండను. మీరు ప్రకృతినిగ్రహులు, నేను బ్రకృతిబద్ధుండను. మీరు చేతనాచేతనోద్ధారకులు, నేను చేతనాచేతనాపహారుండను. మీరు తాపత్రయోపశమనులు, నేను తాపత్రయతప్తమానసుండను. మీరు దోషభోగ్యులు, నేను దోషకృత్యుండను. మీ రాప్తశరణ్యులు, నేనా ర్తవిహీనుండ. ఈరక్ష్యరక్షకసంబంధంబు దేవరవారికే యుచితమై యున్నది. ఇదిసత్యంబు సత్యంబుగదా! కృపజూడు కృపజూడుము. మీ రెఱుగని యర్థంబు లేదుసుమీ॥ నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౫౫

ఆకారత్రియసంపన్నా! తద్వివరణోపదేశకా! అర్థయుక్తంబులుగాని వాక్యంబులు వీడేమి కూసినగాని యది యర్థయుక్తంబే యని మీ చిత్తంబున బెట్టుకొనుము. అది యెట్లంటిరా దేవరవు వేంచేసియున్నస్థలంబున శుకశారికలు చెలరేగి బహువిధంబుల బలుకగా నాయారవంబులకు సంతోషించినట్లు ప్రియకాంతారత్నంబు వృథాలాపంబు లాడిన

హితవు చేసికొని భోగించెదు పతిరీతిని అడియని పలుకులు కృప యుంచి రక్షించవలయు. నీలోగుణంబులు నీవే బయలు చేసెదవు. నే నెల్ల గాతునంటివా యొకా నొకడు కావరంబున నేరంబుచేసి శరణ్యునకు సాగిలి మ్రొక్కి తన నేరంబు చెప్పి శరణుపొందిన మహాత్ములైనవారు గారే? అపరాధపరులుగాక ధర్మాత్ములయిన రాజుల విషయమయి నేరంబుచేసి తమంతటనే తాము వచ్చి కావు మని విన్నవించిన గారే? తల్లిదండ్రులు కుమారుని తప్పు లెల్ల క్షమించి యొప్పుజేసికొనరే? దేవర వల్లా టచేతనే నవవిధసంబంధంబు దేవరకే ఘటించె. అడియనిని రక్షింప వలయు స్వామీ॥ నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౫౬

అకారవాచ్యావతారా! నా యజ్ఞానం బెంత ప్రబలంబో యెఱుంగ. నొరుల కలవిగాని దోషగుణంబులు నిరూపణచేసెద గాని స్వదోషంబులు చెప్పనేర. పరులు బొగడిన మాత్రాన నుబ్బుదు గాని నాయందు లేని గుణంబులుగదా యని లేశం బైన తలంకను. భాగవతోత్తముల జూచి లోకసామాన్య మనుష్యులవలె నెంచితిగాని చరమావతారమైన భగవద్విగ్రహ ప్రతిపత్తి చేయనైతి. భగవద్భాగవతార్చావతారంబులం గని శిలలోహదారు రూపంబు లని తలంచితిగాని లోకంబుల రక్షింప నర్చావతారుడయిన యీశ్వరుం డని భావించి సేవించనైతి. శ్రీవైష్ణవుల గలసి శ్రీవైష్ణవ సమానుం డని సంతోషించితి గాని భాగవతదాస్యం బెరుగనైతి. నా నేర్చు విధంబున గ్రంథంబులు చదివి మంత్ర మంత్రార్థంబులు దెలిసె ననుకొం టినిగాని యాచార్య తిరువడిగళాశ్రయించి పంచ సంస్కార

సంపన్నుడనై భాగవతోత్తముల కృపచేత లభించుకొననైతి. నిట్టి పాపిష్ఠాగ్రేసరుండైన యడియనిని రక్షించు టాచార్య కృపాపూర్తిగాని దేవర దాస్యాధికారులైన దేశికుల రక్షించి యేలుకొనుట సౌలభ్యమే॥నమోనమో॥ ౫౭

చేతనాచేతనరక్షకా! సుఖదుఃఖంబులును కలిమిలేములును రాగద్వేషంబులును కోపతాపంబులును మదమాత్సర్య అహంకారమమకారంబులును మానాభిమానంబులును మనోవాక్కాయ కరణత్రయములు మొదలైన ప్రకృతిగుణంబుల చేత పొరలుచున్న వాడను. రొంపిలో నున్న స్తంభంబు తెరంగున శ్లేష్మములో బడ్డ యీగచందంబున కారాగృహశృంఖలాటవిం దగులుపడ్డ కీటకంబు విధంబున నీదేహబంధువులలో జిక్కి శిశ్నోదరాదిసుఖంబుల బ్రమత్తుండనై సుందరులయిన దారపుత్రాదులు సతం బని మనోహరంబైన మందిరంబులు క్షేత్రారామంబు లార్జించి సొంపుబెంపు లాహ్లాదములు నిత్యం బని ఘోరకృత్యంబులు చేసి దుఃఖింపుచు బశుప్రాయుండనయి దొమ్మి సుద్దులాడువాని వలెనే కర్మకళేబరంబె శాశ్వతం బని యజ్ఞానాంధకారంబునం దగులుపడి తాపత్రయాదితప్తుండనై బహువిధ బాధల బడుచున్నవాడను గాని యాచార్యసన్నిధి నాశ్రయించి మంత్రి మంత్రార్థార్థ [illegible]ంచక రహస్యత్రయాచార్య హృదయాది గ్రంథంబులు సేవించి భాగవత దాస్య వైభవం బెఱుంగనైతి. ఇట్టి మూఢుని శీఘ్రంబున దేవర దివ్య తిరువడిగళ దాస్య సంబంధంబున కభిముఖునిగా జేసి యేలు కొనవే॥నమోనమో శ్రీశఠకో॥ ౫౮

మంత్రమంత్రార్థప్రదాయకా! అడియని యజ్ఞానాంధకార బంధురంబు పోగొట్టి జ్ఞానసూర్యోదయ ప్రకాశంబు గలుగజేయుము. ప్రకృతి గుణంబుల బారద్రోలి యాత్మగుణంబులు వెలిగింపుము. నాలోని స్వాతంత్ర్యంబులు దగులబెట్టి పారతంత్ర్యపరకాష్ఠయైన శేషత్వంబు ప్రకటింపం జేయుము. నేజేసిన పాపంబులు భాగవతులచెంత జేరనీయక తొలంగించుచున్నది. నాలోని యరిషడ్వర్గంబులు ప్రజ్వలించుచున్నవి. నా దుర్మార్గంబులు వ్యాఘ్రరీతిని మించియున్నవి. తాపత్రయాదులచే దప్తుండనై యున్నవాడను. వైష్ణవజ్ఞాన దాస్య వాత్సల్యాతిశయశీతలోదకంబు పై జల్లుము. ఈషణత్రయాదులచే బద్ధుండనై యిడుమల బడుచున్నాడను. దేవర నామోచ్చారణ ఖడ్గంబున నాబంధంబులు ఖండించుము. నామనంబు పద్మపత్ర జలంబువలె చలింపుచున్నది. ఇట్టి దురాత్ముని సంబంధంబేమిటి కని విడనాడకుము. అడియనివంటి నీచుని కృపచేత రక్షించనేగదా! దేవర నీ యవతారం బవతరించుట. ఇది దేవర తిరువుళ్లంబున నుంచి యేలుకొనుము॥నమోనమో॥ ౫౯

శ్రీమద్రామానుజమతోద్ధారకా! అడియనియాత్మ తరుణోపాయం బెఱుగక కుటుంబపోషణంబే పరమార్థం బని యెంచి, చేసి చేయరాని కృత్యంబు లపారంబులుగా గలవు. డాయరాని పరాంగనలం గదిసితి. బాయరాని భాగవతుల సేవకుం బాసితి. కుడువరాని దురాన్నంబు గుడిచితి. నుడువరాని దుర్మంత్రంబుల నుడివితి. గడుపరాని గురునాజ్ఞ గడిపితి. విడువరాని భగవత్కైంకర్యంబు విడిచితి. తలచరాని తలంపులు దల

చితి. కొలువరాని కొలువులు గొలిచితి. నిలువరాని స్థలంబుల నిలిచితి తిరుగరాని చోట్లెల్లం దిరిగితి. ఇట్టి కృత్యాకరణాకృత్యాకరణంబులు సల్పితి. దేవర వారెఱుంగని దేమి యున్నది? ఇక నడియని యేమి చేయగలవాఁడను? ఇనుమును కూర్చి యగ్నికి పెట్టు లన్న సామెత నెంచుకొండ అడియని దేవర దివ్య తిరువడిగళ సన్నిధి కైంకర్యము లాచరించుటకు కింకరునిగా జేసి యేలుకొనుము॥ నమోనమో శ్రీశఠకోపదేశికో॥ ౧౮ ౬౦

రఘుపతియనుజాంశసంభవా! ఈరాత్రి యడియని నొక స్వప్నముఖంబున సేవించిన సేవయు దేవర సన్నిధిలో విన్నపంబు చేసెద. విన నవధరింపవలయు. నవేమి సేవించితివని యానతిచ్చితి. రాజాధిరాజలతారును శంఖచక్రంబుల దాల్చిన చతుర్బాహువులును నవరత్నఖచితంబయిన కుళ్ళాయియు దొడిగిన తిరుముడియు తిరుమణి శ్రీచూర్ణంబు చాతిన యూర్ధ్వపుండ్ర రేఖలును గల లలాటంబును పద్మదళంబులభంగి విశాలనేత్రయుగ్మంబుల దాసుల కటాక్షించుచు మందస్మితంబగు ముఖారవిందంబును కంబుసన్నిభంబైన కంఠంబును దాసులకు నభయంబొసంగి యాదరించెడు బాహువులును విరాజమానితంబైన విశాలవక్షస్థలంబు సకలబ్రహ్మాండంబులు నునిచికొనిన కుక్షియును. గంభీర పద్మనాభియు కల్గిన తిరుబొజ్జయును. ధవళశితంబైన యజ్ఞోపవీతంబును. నీర్కాని తిరువేష్టులతో నావరణంబై యున్న కటిప్రదేశంబును కనకరంభాతిరస్కారంబులయిన యూరు యుగళంబును. చేతనాచేతన సంరక్షణార్థంబు లయిన శ్రీహస్తంబులును. దాసకోట్లకెల్ల ప్రాప్యప్రాపకంబైన యరు

ణారవిందంబు లనుకరించుచున్న దివ్యతిరువడిగళ జంటయును యెళయ పెరుమాళ్ళ సాన్నిధ్యంబు గలిగి వేంచేసియున్న దేవర దివ్యమంగళ విగ్రహంబును నాకన్నుల కరువుదీర నతిభక్తితో ననంతసేవింపులు సేవించి యంతట మేలుకొని పులకితశరీరుండనై గద్గదకంఠంబుతో స్తుతియించుచు స్వప్నఫలవిగ్రహంబు ప్రత్యక్షంబున సేవించుట యెన్నడో యని ధ్యానమానసుండనై చిత్తంబునం గిలింపుచున్నంతట అడియని భాగ్యవశంబున దేవరవు తద్విగ్రహంబుగా సేవ సాయించితిరి కృపచేత దాస్యరుచిని దెలిపి కృతార్థునిం జేసి యేలుకొనుము॥ నమోనమోశ్రీశఠకోప॥

యతిరాజశేఖరా! అడియని దేహధర్మంబు వదలి యాత్మగుణంబులతో నుండెద నంటినేని యన్నగతప్రాణంబయిన కలియుగంబు గాని పూర్వయుగంబులు గావు. కలియుగంబైన నేమి నిమిషార్థంబైన భగవద్ధ్యానంబు చేసి తరించెదనంటినేని నామనంబు పద్మపత్రజలంబువంటిది గాని స్థిరంబుగాదు. మనః స్థిరతకై నిస్సంగుల చెలిమిచే నేకాంతంబున నుండెదనంటినేని దారపుత్రాది యీషణత్రయబంధకంబులు వదలవు. తద్విషయ బంధకంబులం బాసెద నంటినేని భగవన్మాయాప్రభావంబులకు ప్రతిహతంబై యున్నది. భగవన్మాయ జయించెదనంటినా బ్రహ్మరుద్రేంద్రాది దేవతలకును, నారదాది మహర్షులకును శక్యంబుగాదు. నే నెంతటివాఁడ నిట్టి లంపటలంబడ శక్తుండఁ గాక నేకదా భాగవతదాస్య ధర్మంబు సులభోపాయంబని దేవర తిరువడిగళాశ్రయించితి. మీ దివ్యనియమంబులకు త్రికరణ శుద్ధి చాలదు. అయినను మీ దివ్యచరితంబులు విన్నపంబు

చేసినమాత్రమే కాని దేవర తిరువుళ్ళము సంతోషంబు పెట్ట నేర నిక మీరాచిత్తం బడియని భాగ్యంబు॥ నమోనమో॥ ౬౨

పరమగురు వేంకటాచార్య కటాక్షపాత్రా! భగవానుల పాదంబులం బట్టి ప్రార్థించెదనంటినా భరతునివంటివాడ గాను. శేషశయ్యాను నిష్ఠానువర్తనా బెరింగి సేవించెదనంటినా లక్ష్మణు నంతటివాడను గాను. సహాయంబు చూపి మెప్పించెద నంటినా సుగ్రీవుండను గాను. సామర్థ్యంబుచే గింకరత్వంబు చేసి సంతోష పెట్టెద నంటినా హనుమంతుడను గాను. ప్రాణంబిచ్చి వశంబు చేసికొని కడతేరెదనంటినా జటాయువును గాను. శరణుజొచ్చి దయ పుట్టించుకొనియెద నంటినా విభీషణుండనుగాను. విందు పెట్టి చిత్తంబు మెప్పించెద నంటినా శబరినిగాను. ఉపవాసంబు లుండి కరుణ వహించెదనంటినా రుక్మాంగదుండను గాను. ద్వాదశి పారణలు చేసెదనంటినా యంబరీషుండను గాను. కర్మ జ్ఞాన భక్తి నిష్ఠ జరిపెదనంటినా జనకచక్రవర్తిని గాను. జ్ఞానానుష్ఠానంబున నీశ్వరు నారాధింతు నంటినా జడ భరతుండను గాను. భక్తిప్రపత్తి పారవశ్యంబులచే మిమ్ము ప్రసన్నంబు చేసుకొనెద నంటినా ప్రహ్లాదుండను గాను. ప్రాపత్తిచేసి కరుణ వహించెదనంటినా ద్రౌపదినిగాను. తపంబుచేసి యారాధించెద నంటినా ధ్రువుండను గాను. దానంబులొసంగి యొద్ద నుండెద నంటినా బలిచక్రవర్తిని గాను. నింక నే నెన్ని యుపాయంబుల చేతను సర్వేశ్వరుని వశంబు చేసుకొననేరక దేవరవారి పద పద్మములందు శరణాగతియని యుపన్యాసదాసులకు దాసుండ

న్నైతి. అది విచారించి కృపచేత నడియనిని నేలుకొనుము॥ నమోనమో శ్రీశఠకోపదేశికో॥ ౬౩

శమదమాద్యనంతకల్యాణగుణసంపన్నా! ఈశ్వర మాయా ప్రపంచంబునకు వెరచి దేవరసన్నిధి నాశ్రయించిన మాత్రమే కాని యాచార్యాభిమాన నిష్ఠుం బూన మధుర కవి యాళ్వారును గాను. మిమ్ము బ్రత్యక్షంబు చేసుకొని సేవించ శ్రీమన్నాధమునిని గాను. మీయాజ్ఞానువర్తనపరికారంబను వర్తించి పారతంత్ర్యపరుం డయ్యెదనంటినా కూరత్తాళ్వారును గాను! దేవరకు దాస్యవృత్తిని జేసికొని యుండెదనంటినా మొదలి యాండాను గాను. శౌర్యస్థైర్యంబున నర్థసంగ్రహంబుజేసి సమర్పించెద నంటినా పిళ్ళయురంగునిం గాను. దేహాభిమానంబువదలి తదీయారాధనపూర్వకంబుచే ముఖోల్లాసంబు పొడమించెద నంటినా పత్రికొల్లై యమ్మాళునుగాను సన్నిధి ద్వారంబు గాచి తచ్ఛేష ముజ్జవించి తెరించెదనంటినా తిరుక్కణమంగై యాండాను గాను. భాగవతశేష భూతుండ నయ్యెదనంటినా శతుఘ్నుండగాను. ఇంక నేమిసేయువాఁడను. నేదిగతి? యేది యుపాయంబు? మీసన్నిధి దాసానదాసులకు దాసుండయ్యెద. నడియని గడతేరు టెట్లో యె తెరువుసాయించరే॥ నమోనమో శ్రీశఠకోప దేశికో॥ ౬౪

దాసబృంద సంరక్షణా! ప్రపన్నులయిన మహాత్ములు లోకులగలసి దుర్వ్యాపారంబు లాచరింతురేని మేకపన్నివులు లతో గలసి విహరింపజనుట. కామినుల సంయోగ సుఖంబు గోరుట. తేనెపూసినకత్తులు నాకంజనుట పురాణశ్రవణంబు

సేయంబోవుట హరిణంబులు ఘంటానాదంబు లాలకించి వేట కాని చెంతకు బోవుట. యితర మతాంతరుల సహవాసంబు సేయంబోవుట. భేకంబు మండూక శ్వాస ఫణి సాన్నిధ్యంబునకుం బోవుట. తపంబు సేయుంబూనుట. మరుదేశంబున గంభీరంబుగా నిండ్రినీలజలంబు ద్రావంజనుట. యుపవాసంబు లుండ మదిం దలచుట. సముద్రోదరంబున మాణిక్యంబులు దెచ్చెదనని యత్నంబుజేయుట. యోగంబు సాధించెదనని పూనుట ఆకాశంబునగల చుక్కలజూచి యాణిముత్యంబులని పట్టనెగయుట. దానధర్మంబులు సేయంబూనుట. యింద్రజాలంబునంగల సొమ్ములు నమ్ముట. సత్కర్మంబులుసేయ నుద్యోగించుట. కొండ నెత్తిబెట్టుకొన దలంచుట. అటుగాన నిటువంటి యత్నంబులు వర్జించి దేవర శిష్యకోటిలోజేరి భగవద్గుణానుభవామృతపానంబుజేయుచు గాలంబు గడుపుచున్నాడను. దేవరలే రక్షకులునుమా॥నమోనమో శ్రీశఠకోప॥ ౬౫

స్వరూపోపాయపురుషార్థనిర్ణయా! మన్మథు డనియెడు కిరాతకుడు కర్మప్రకృతు లనియెడు సహచరులం గూడుకొని సంసార గహనమధ్యంబున నవివేకియైన జీవుం డను హరిణంబు బట్టదలంచి యీషణత్రయంబులను కాలురులొడ్డి సత్వ రజ స్తమంబులను వలలో బోగువారి తాపత్రయాదులనుపడుగుంట ద్రొవ్వి పంచేంద్రియంబులను కొఱ్ఱులుపాతి అరిషడ్వర్గంబులను శునకంబుల నుసుకొలిపి కాంతాసంగమంబను వేటమృగంబుదాల్చి మమకారంబను బాణాసనంబున అహంకారంబను శరంబు దొడిగి యెదుట నిలిచిన మోహపాశంబులంగట్టి

యముడను రాజునకు గానుక పెట్టదలంచినాడు. అందుకు దేవర కృపయనియెడు సేనానాథుని జ్ఞానం బనియెడి బలంబుగూర్చి పంపి వైరాగ్య భక్తిప్రపత్తులనెడు నాయుధంబులచే మదన కిరాతులజయించి యాహారిణమును దేవరసన్నిధికిం దెప్పించి శ్రీపాదతీర్థంబున స్నానంబుచేయించి తళియప్రసాదంబుచే గాత్రవంబొసంగి ద్వయార్థంబను పాలుపోసి చరమార్థంబను శిబిరంబును మంత్రార్థంబను హంసగమనంబును మీయాజ్ఞాను వర్తనంబు శిరసావహించి పురుషోత్తముని మీది భోగేచ్ఛ పురుషార్థంబని యున్నవాఁడ. నిట్టి సమయంబున దేవరవు అర్థపఞ్చకజ్ఞానోపదేశంబను నోలిపెట్టి శమదంబులచేదాటంక ముక్కుధలుపెట్టి జ్ఞానభక్తి వైరాగ్యంబులను నితర భూషణముల నలంకరించి శుద్ధ సత్వంబను శుభ్రవస్త్రంబుగట్టి అకారత్రయ సంపన్నత్వంబను రవికెదొడిగి పూర్వాచార్యుల శ్రీసూక్తి బలంబుల వకుళాభరణులు పెండ్లిపెద్ద లెంబెరుమానారుల యాజ్ఞకులుగా నమర్చి మాంత్రి మంత్రార్థ భావంబుచే మంగళసూత్రంబు గట్టించి ప్రకృతి గుణంబులనెడి పుట్టినిల్లు పాపి యాత్మ భగవద్గుణానుభవంబను నత్తవారింటికి దోడుకపోయి నిజదాస జనసహవాసంబుచే జెలికత్తెలంగూర్చి భాగవత ధర్మ వర్తనంబను కాపురంబున మెలంగింపుచు భగవద్భాగవతాచార్య కటాక్షంబుచే బరమపదంబను పడకింటిసజేర్చి మీసన్నిధి కైంకర్యబలంబుచే నవవిధ సంబంధ ప్రమాణంబు లనవరత విభవ భావ భవ్య సరస రతుల దేలించి లాలించి శ్రియఃపతి యేలునటుల దేవరకృపచేత నడియనికి గలుగజేయవే॥నమో॥౬౬

కుటిలమత కుతర్కవాద విధ్వంసకా! మదీయజన్మంబని యెడు గోపకోడె ప్రకృతిగుణంబులచే బాగరెక్కి యీషణ త్రయంబులను చేని కంచెలదూరి పంచేంద్రియ వ్యాపారంబులను పయిరుమేయుచు నహంకార మమకారంబులను రంకెలు వేయుచు రజస్తమంబులను యవ్వనంబుచే గర్వించుచు లౌకిక ధర్మంబులను కోడెలం బొడుచుచు నన్యశేషంబను బందలపై బడి రమించుచు అజ్ఞానంబను దేవతాంతరయితరాంతరములచే మారులేక మసలుచున్నవాడ. దేవర దాసానదాసుడను. బంటు బంటుకుబంటను. దాసుని దోషంబులెల్ల సహింపుము ఎల్ల సహించెదనన్న జ్ఞాన భక్తి వైరాగ్యంబను హాళిగలంగూర్చి మీకృపాకటాక్షం బనియెడు పగ్గంబులు పైచి పట్టి వృత్తి ప్రవృత్తులనియెడు స్తంభంబునంగట్టి తిరువష్టాక్షరి మంత్రంబుచే ఘాసంబువేసి సాత్వికంబను నీరుపోసి ద్వయమనియెడు గంతగట్టి చరమార్థమనియెడి భారంబుమోయించి భాగవత సహవాసంబుచే సాధు కోడెలలో మెలంగించి శేషత్వమనియెడి దొడ్డి గట్టించి పారతంత్ర్యములచే బనులుగొని దేవరసన్నిధి కైంకర్యంబులు చేయించుకొని కృషివాణిజ్య ఫలంబులచే నానందించి రక్షింపుము॥ నమోనమో శ్రీశఠకో॥ ౬౭

భాగవతధర్మస్థాపనాచార్యా! అడియని యజ్ఞానంబుచే సంసారసాగరంబునం బడి తాపత్రయాది పంకంబులో జిక్కి వెడలనేరక లోకచర్యలచేత గరటపట్లు నొక్కులచే నొచ్చుచు నీషణత్రయంబులను సుళ్ళలో బడి సుడిపెట్టుచు కామ్యానుభవంబులచే గుములుచు అరిషడ్వర్గంబులను తిమితిమింగిలము

లచే బోట్లు బొడువంబడుచు గుణత్రయంబులను జలజంతు
సమూహంబుతో మెలంగుచు సుఖదుఃఖాదులను మేఘోదకం
బుల కెదురుచూచుచు నిట్టి యజ్ఞానతిమిరంబునం బడి జనన
మరణంబులచే నరకంబులం బొరలు కీటకంబు చందంబున నట్టి
ట్టిడుములం బడి యనంతకాలంబు దుఃఖింపుచున్న జీవిని పాప
పుణ్యంబులచే జన్మకర్మసాగరంబునం బడి మునుగుచున్నవాడ.
భగవద్భాగవతాచార్య కృప యనియెడు నావ యెక్కించి దేవ
రవు కర్ణధారుండవై పరమ పదంబున విరజతీరంబు జేర్చి
యచ్చట నిత్యసూరులై వేంచేసియున్న యమానవకరస్పర్శచే
నంతట దిరుమామణి మంటపమందు సహస్రఫణాఫణిపై బవ్వ
ళించియున్న శ్రీ శ్రియఃపతి దివ్య తిరువడిగళ సేవానంద భరి
తునిం జేయవే॥ నమోనమో శఠకోపదేశి॥ ౬౮

ప్రణవస్వరూపానందవిభవా! నామూఢత్వంబు నే నేమని
విన్నవించెద. ఆహారబలంబుచే బుట్టితి; నందు దాపత్రయాదు
లందు బడి బద్ధుండనైతి. మలమూత్రద్వారంబుచే వెడలినం
దుకే నాశించి కర్మానుకూలులయిన యాభాసబంధువులం
గలిసి వర్తించితి. ప్రాప్యప్రాపకులైన పరమభాగవతోత్తములే
బంధువర్గంబని తెలియనైతి. పరమాత్మకు దాసభూతుండైన
యణుమాత్రపు నాత్మ యని దలంచక రక్తమాంసమేదోస్థి
చర్మావృతంబైన దుర్గంధపు హేయదేహము నేను నాదని
తలంచిన మాత్రమే కాక నేను వర్ణశ్రేష్ఠుం డని మిక్కిలి
నిక్కితి; నివి మొదలైన యభిజనవిద్యావిత్తాదులచే గర్వింపు
చున్నవాఁడను. నాయం దిట్టి యుపచారంబు లనంతంబులు

గలవు. దేవరవు మోక్షప్రదాతవు అడియనిని క్షమించి రక్షించి మంత్రి మంత్రార్థం బొసంగి మీ తిరువడిగళకు దాసభూతు నిగా నేలుకొనవలయునుమీ॥నమోనమో శ్రీశర॥ ౬౯

మధుర కవ్యంశసంభవా! భగవదవతారంబులలో విరాడ్రూపంబువలన ననంతంబులయిన బ్రహ్మాండంబులు బ్రహ్మాండం బొక్కటికి బదునాలుగు లోకంబులును నవఖండంబులును సప్తద్వీపంబులును సప్తసముద్రంబులును నొండొంటికి ద్విగుణ విస్తరంబై యుండు. నీవ లావల చక్రవాళ పర్వతంబు. ఆపర్వతంబు చుట్టు సూర్యలోకంబును నష్టదిక్పాలకుల పురంబులు చంద్రసూర్య నక్షత్రాది మండలంబులు నందుపై దేవేంద్రాది లోకంబులు నచట స్వర్గాది పురంబులు తత్పురంబుల క్రీవల నష్టవింశతి నరకస్థానంబులు తస్థానంబుల క్రీవల క్రిందుగా లక్షయోజనంబైన విస్తారంబుగా మధ్యలోకంబైన భూలోకంబు నీలోకంబు మధ్య మందు మహామేరువు ఆమేరువుచుట్టు వలయాకారంబుగా నష్టదిక్కులు మొదలైన మేఘమండల వాయు మండలంబులు గలవు మేరువు దక్షిణ దిగ్భాగమున జంబు ద్వీపంబు ఛపన్న దేశంబు లుండు. నిందు గంగానదీనదంబులు మొదలైన పుణ్యనదులుండు. శ్రీబదరికాశ్రమంబు శ్రీపురుషోత్తమంబు శ్రీరంగాది దివ్యదేశంబులుం గలిగియున్నది. తక్కిన యజాండస్థలంబులు భోగస్థానంబు నందు గై వల్యాదు లుండు కాండద్వయకర్మసరణీయుక్తంబు లాచరించిన పుణ్యాను భవకాలం బెందాకనో యంతవరకు నియమప్రకారంబు చిత్రానందం బనుభవించిన తదనంతరం బీ జీవులు మరల నీ భూలో

కంబున జననం బెత్తుచుందురు. పాపంబు లార్జించి రౌరవాది నరకంబు లనుభవించు పాపాత్ములం జెప్ప బహుదుఃఖంబులుం జెందుటకే హేతువగు నిట్లన్ని యేల చెప్పెదవంటిరా బ్రహ్మ కల్పంబు మొదలిదివరకు నే జేసిన సుఖదుఃఖ పాపపుణ్యానుభవంబు లనుభవించి యిట్టి యిడుమలంబడితి. యుగయుగంబులకెల్ల నీ యుగం బీదినం బీసమయంబున దేవర నిర్హేతుకజాయమానకటాక్షంబుచే నతిసులభంబైన పరమభాగవతుల సహవాసంబుచే గదా దేవర దివ్యమంగళ విగ్రహంబు ప్రత్యక్షసాక్షాత్కారంబై యాచార్యరూపంబున నవతరించి నయడియనికి నర్థపఞ్చకర హసతస్య్రియపారతంత్ర్య శేషిశేషసంబంధంబు బోధించి, శ్రీ శ్రియఃపతి కృప గలుగజేసి యేలుకొంటిరి॥

నమోనమో॥ ౨౦

గురుకులసార్వభౌమా యుగంబులముందుత్కృష్టవర్ణలకే మోక్షంబు గలదని! కర్మాద్యుపాయంబు లనువర్తించిరి. బ్రహ్మరుద్రేంద్రాదులతో శ్రీమన్నారాయణుండు సముఁడని శ్రుతివిరుద్ధంబుగా వర్తించి యనేకులు భగవదపచారంబునం బడుచున్నవారు. శేషిశేషసంబంధంబు దెలియక యాత్మాపహారంబు భగవద్ద్రవ్యాపహారంబనుట ఆచార్యుండే సాక్షాద్భగవానుడని యెంచక మనుష్యమాత్రుండని తలంచుటే యాచార్యాపచారంబు. భగవద్భక్తులని భాగవతుల సేవించి. కడతేరు తెరువు దెలియక వారి వర్ణాశ్రమాచారధర్మంబు లిట్టి వనితలంచి, నిందించుటే భాగవతయపచారంబు. భగవదాపచారంబు పడుట యమదండనపరు లౌదురు. ఆచార్యాపచారంబు చేయుటే

జన్మపరంపర నరకప్రాప్తి భాగవతాపచారంబు జెందువారనంత జన్మంబులెత్తి, కుంభీపాకంబయిన నరకంబు లనుభవింతురు ఇట్టి యపచారాదులు చేసినవారి నేయుపాయంబుచే నెటువలె రక్షింతువో॥ నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౭౧

సర్వజ్ఞశిఖామణీ! విష్ణుమాయాప్రభావంబులంజిక్కువడి సంసారంబనెడి సంకిళులు దగిలించుకొని పుత్రీపణంబను చీలలు బిగించుకొని దారాదిమోహంబు లను త్రాళ్ళచే గట్టబడి దేహబంధువులను తెరవాటుకాండ్రకు ల్లలకొల్లంబడితి. ధనీష ణంబుచే బంటుబంట్లకు బంటనైతి గర్మబద్ధులైన ధనికుల కెల్ల జేయ రానిచాకిరీలు చేసి బహుబాధలం బడితి. విరక్తిమార్గంబు దెలియంజాలక స్వకీయపరకీయ భిన్నభావంబులచే బలు తెరంగులగు పాట్లుల బడినవాడ. నిట్టి మాయలంబెట్టిన సర్వేశ్వరుండవు కాబోలు! నిప్పుడు మీరు కీశమార్జాలన్యాయంబున గృపగలిగి యాచార్యరూపంబుచే నవతరించి, పరమభాగవతుల సంధిపంపి పురుషకారనై భవంబుచే నడియని మోహపాశంబులం దెగటార్చి సన్నిధికి రప్పించుకొని పంచసంస్కార సంపన్నునింజేసి మంత్రిమంత్రార్థ జ్ఞానబోధపఱిచి శేషత్వ స్వరూపంబు దెలియజేసి ద్వయానుసంధానపరుని గావించి భాగవత సహాయంబు గలుగజేసి యేలుకొంటివి॥నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౭౨

యతిరాజ సంపత్కుమారాంశావతారా! అడియని యొక విన్నపంబు విన్నవించెద; నదేమంటిరా ప్రకృతిసంబంధమైన మనంబు బహువిఘ్నకారి. పవనచలిత దీపశిఖయునుం

బోలె జలనవృత్తిగలది. బహుముఖంబులంబారు మేఘఖం డంబువంటిది. విద్యుల్లతలకు గురంగంబు తెలంగున దాటులు దాటు మహానాగంబు పరులజూచి పైబడు చందంబు శునకంబు పనిగలదై దూరంబునకు పరుగెత్తిపోయి కాలల మగిడి వచ్చుమాడ్కి సురాపానంబు చేసిన వానరంబు రీతి విపరీత వికారంబులు చేయును. కలగని వ్యర్థంబు లయిన తలంపులు చాలదలంచును. దీనితో సహవాసంబు మిగులమీఁది సాముపం టిది. అపరిమిత చేష్టలకు నాలయమైనది దీని గుదియ బెట్టెదనంటినాగలిముడియగట్టరానిది దీని తెలంగి లాటిదని చెప్ప నా చతుర్ముఖున కలవిగాదు. నే నేపాటివాడను. అదిగాన నేనేమిసేసినగాని నేరంబులెంచక దాసుని తప్పు దండమున కొప్పునట్లు అప్పటికిప్పుడె దేవర తిరువడిఘళ. సంబంధ సంబంధ దాసానదాసులకు నత్యంత సేవింపులు సేవిం చెద॥నమో నమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ 23

అమృతోద్భవాంశసంభవా! ఉభయవిభూతి నాయ కుండై స్వామియై సౌశీల్య సౌలభ్య వాత్సల్యాదులుగల పర వాసుదేవుని దివ్యమంగళ విగ్రహానుభవానందంబున జేత నా చేతనంబులకు జననియైన పెరియపెరాట్టియారు పరవాసుదేవుని దివ్యమంగళ విగ్రహానందంబుచే నీశ్వరు నెడబాయక నిత్యాన పాయినియై కల్యాణగుణామృతవారాశి నోలలాడు శ్రీమత్ప రాంకుశ పరకాలయతి వరవరమును లాదిగాగల యాళ్వా రుల దర్శనస్థాపనాచార్య పరంపర పర సమృద్ధినిర్వాహకంబుకై గీర్వాణ సన్యాసంబు వహించి దాసదాసులతో ద్రావిడా

మ్నాయామృత పానంబుచేయుచు పెరియజియ్యరు సంప్రదాయ ప్రకారంబు తత్వత్రయ రహస్యత్రయ శ్రీ వచన భూషణాది సద్వ్యాఖ్యానంబులన్నియు దేవరసన్నిధియందు స్వామిస్వాములంద రాశ్రయించి యధికరించి రిట్టి వాత్సల్యాతిశయ వైభవంబులుండ జూపి దేవర దాసానదాసునింజేసి యేలుకొంటివి గదే తండ్రీ॥నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౭౪

జ్ఞానప్రభావదివాకరా! మున్ను బదరికాశ్రమంబున శ్రీమన్నారాయణుండు తానే నరునికొరకు బయలువెట్టిన తిరుమంత్రంబు దేవరవుచేతన సారతరంబుగా నుపదేశించి రక్షింవుచున్నాడవు. శ్రీవైకుంఠంబున సర్వేశ్వరుండు పెరియ పెరాట్టియారుతో నానతియ్య ద్వయం బస్మదాదు లనేకు లుద్ధారకులవుటకు తెలియచేసితిరి! ముక్తిమార్గంబు దెలిపి చూరలిచ్చుచున్నారు. కురుక్షేత్రంబున యుద్ధభూమియందు రథంబు మీద నర్జునునకు శ్రీకృష్ణుం డీది పరమరహస్యోపాయం బని సత్యంబుగాబల్కిన చరమార్థంబు దేవరవు శిష్యసమూహంబుల కెల్ల నర్థయుక్తంబుగా దెలిపి పరమపదంబుజేర నర్హులంజేసెదరు. అదిగాన నీశ్వరుని సామర్థ్యంబుకంటె దేవరసామర్థ్యంబు దొడ్డనవచ్చును. నెట్లన్న సానపెట్టిన రత్నంబు మిక్కిలి కాంతి గలిగి ప్రకాశించినట్లు అద్దంబు చికిలిచేసిన తరువాత ప్రకాశంబు ప్రతిఫలించినట్లు వైనతేయావతారానంతరంబున నాంజనేయాకారంబుచే ఘనుం డనిపించుకొన్నట్లు దేవరవు మహాఘనులు ఈశ్వరునికి పూర్ణ షాడ్గుణ్య కల్యాణగుణంబు లనంతంబులని ప్రసిద్ధింజేసితిరి. ఇట్టి సామర్థ్యంబులచే దేవర శిష్యసం

ఘంబుల దోషంగలుగజేసి యేలుకొంటివి; యిక నాకేమి కొదు వయులేదు॥నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥　　2౫

తత్త్వత్రయోపదేశపూర్ణచంద్రోదయా! దేవర వీశ్వ రావతార సమయంబున మీ నాభికమలంబున బ్రహ్మను గల్పించిన నతండు జన్మకారణంబుచే మిమ్ము సేవించ దలంచి తామరనాళంబు వెంట నూరేండ్లు దిరిగితిరిగి మిమ్ము గనలేక యెప్పటివలె పద్మంబుకడకువచ్చి తపింప నంతట మీరు తపతప యని ధ్వనిపుట్టించ నది తెలిసి నూరుసంవత్సరంబులు తపం బాచ రించినప్పుడు శ్రీవైకుంఠంబుతో సయితము ప్రసన్నంబై బ్రహ్మాండాధిపతిం జేసిన నతండు శక్తుండగానని నపుడు వేద పర్వతరాసులలో నాలుగుచూపి నాలుగు పిడికెళ్ళు పుచ్చుకొన జేసిన నవి నాలుగు వేదంబులయ్యె. అంత నవి సోముక ముఖం బున జిక్కువడియె. నపు డాది వరాహంబై సంహరించి మగుడ నిచ్చి తదనంతరంబు హయగ్రీవావ తారంబై చిక్కులువాపి వ్యాసావతారంబున శాఖాభేదం బేర్పరిచి అవిచాలక యారు శాస్త్రంబు లేర్పరచితిరట. అవి తెలియనేరకయున్న ఋష్యావ తారంబులై పురాణేతిహాసంబులు గల్పించితిరట పూర్వ కాలంబున నిన్నిటియందు ప్రవృత్తిధర్మంబును ఉత్తరకాండ యందు నివృత్తిధర్మంబు లానతిచ్చితిరట, ఇదిగాక కర్మజ్ఞాన భక్తిప్రపత్తులు నాలుగుపాయంబులు గలుగజేసిరట. యిప్పుడు పంచమోపాయంబున్న చేతనకోట్లను రక్షింపుచున్నాడవు. మాయాభ్రమికులై తెలియక కుదృష్టుల కల్పనలవలన మోహన శాస్త్రంబులం జిక్కి యాథార్థ్యంబు తెలుసంగంజాలక

ప్రవర్తించు మూఢుల కర్మప్రాప్తం బేమనవచ్చు. దేవరుల యెడ పక్షపాతంబు లేదుసుమీ॥ నమో నమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౨౬

భక్తచింతామణీ! హారీతనైన వేదంబులు విష్ణువునే పరతత్త్వం బని ప్రతిపాదించక యితర దైవంబుల సహితము ప్రార్థించుట యేమియనియు సర్వేశ్వరుని వాగ్వైభవంబులైన శ్రుతులు మోక్షహేతువులైనవని నివృత్తిధర్మంబులం జెప్పక కామ్యకర్మంబులం జెప్పుటయు జెప్పెబో గంగాతీర్థంబుకంటె తుల్యంబైన యామ్నాయంబు కొన్ని ధర్మంబులం బట్టి కొన్ని విడువబడునని చెప్పవచ్చునాయని మూఢమతులు శంకింతురు. ఆశంకలు బాపి సమాధాన మవునటుల బెద్దలానతిచ్చిన విధంబు విన్నవించెద. సర్వాంతర్యామియైయుండు శ్రీమన్నారాయణుని బట్టికొనిన యన్యదేవతా భజనంబుగాదు. అన్యదేవతలనెన్ని యారాధించినగాని తదారాధన ప్రీతుండంతర్యామియై వర్తించు శ్రీహరియు కామ్యకర్మంబులిచ్చి రక్షించునని గీతావాక్యంబులం బ్రవచనంబై యున్నది. చేనుమేయుగొడ్డుకు గుదిగట్టి లంకె బెట్టి కాని కృషికొదుగునని యు పశుప్రాయులైన యజ్ఞానులను కర్మకాండంబే నడిపించికాని సుజ్ఞానుండుగాడు. వేదంబు గంగ వంటిదైనను రజకుఁ డుదికెడు రేవును, చండాలవాటిక సమీపంబుననున్న చోటును, స్నానపానంబు చేయుట కయోగ్యంబనియును అదియునుంగాక వేదంబు సముద్రంబువంటిదియు గంగ వంటిదియు అందురుగదా అందు రాయిరప్ప నాచు గుల్ల గవ్వ గొల్కిప్రాన శంఖంబులు నివి మొదలైన యనేక జంతుజాలం

బులుగలదై యుండ వివేక సమర్థులైనవారు ముత్యంబు లెఱిగి కొని పట్టె యనుభవించినట్లు అంగడిని చేప జల్ల గంజాయి పొగాకు యిట్టి నిషిద్ధవస్తువు లెన్నియమ్మినగాని సుజనులు పంచ దారగొని యనుభవించినట్లు మఱియు మహానుభావులైన రాజ రాజు రాజ్యంబున ననేకరాజులు రాజ్యపాలనంబుచేసి రారాజు నాజ్ఞవడసి కప్పంబు లిచ్చియున్నరీతి మహాప్రభునైన వాడు తన యానందంబుకై బహు పరిచారికలచేత పరిచర్యలు చేయించుకొన్న చందంబున నారాయణాత్పరోదేవ యను శ్రుతులవల్ల ప్రసిద్ధంబులై యుండ సుజ్ఞానులైన వా రాచార్య కృపచేత భాగవతధర్మం బనుష్ఠించి ముముక్షువులును ప్రపన్ను లునై పరమపదంబు జేరరే॥నమోనమో॥ 22

కలికలుషవిదారీ! వృక్షంబు మొదల జలంబునోసిన స్కం దశాఖోపశాఖ పత్రపల్లవంబులకు చల్లనై ఫలించు, నొక్కొక్క కొమ్మ దడిపిన ఫలించదు. అట్లగు నాయాది మూలకారణం బైన శ్రీమన్నారాయణుని నారాధించిన త్రయస్త్రింశత్కోటి దేవతలు తృప్తిబొందుదురు తమతమ మనోవాంఛ లీడేరును. దేవతాంతరంబులం బట్టి పూజించిన కడతేరలేరు. పతివ్రతయైన సతి పెనిమిటి నారాధించి తచ్చిత్తంబు వచ్చునట్లు చేసిన నితరు లేమిచేయగలరు? యెవ్వరి నెంత యుపచరించిన పతి చిత్తంబు నకు రానిసతి యిహపరదూర యగునట్లు ప్రపంచంబునకు కర్త భర్తయగునన్నట్లు శ్రీహరిని గొల్చినవారు ముక్తులగుదురు. దేవతాంతరభజన చేసినవా రిహపరదూరు లగుదురు. మఱియు చెఱుకుచెక్కలు నమలి నాలుక పగిలిన కొంతదడవు నోరు

నొచ్చినపిదప మధురసంబు పానంబు చేయుచుండుటకై అట్టి గడలను చెరుకాలాడి రసంబుదీసి బెల్లంబుగా గాంచి పిదప పాకంబు పెట్టి పంచదార గావించి యనుభవసారసంగ్రహంబు పగిది భగవద్భాగవదాచార్య నామస్మరణవిభవంబై యున్న స్వయత్నప్రియత్నంబు బహుప్రియాసంబున ఫలంబున ఫలంబుజెందు నాచార్య కృపచే పంచసంస్కారసంపన్నులై మూలమంత్రంబను తిరువష్టాక్షరి తిన్నగా గ్రహించి తత్త్వార్థాంశనిష్ఠులగు భాగవతుల నాశ్రయించి పురుషకార వైభవంబుచే పరమపదంబు లభ్యంబగు॥ నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౭౦

పాపపుణ్యాంధకారనివారణభాస్కరోదయా! పాపాత్ముండగువాడు తత్పాపంబుల కొలంది నరకంబుల ననుభవించి పాపశేషంబుతో భూలోకంబునకువచ్చి గరికసువ్వు మొక్క మొలక మొదలైన సూక్ష్మస్థావరంబులై పుట్టి వెనుక వృక్షపాషాణాది సర్వత్ర బహుకాల స్థావరంబుల జన్మించి. పిదప స్వేదజాండజబుద్బుద మశక మక్షిక క్రిమికీటకాది సూక్ష్మజంగమంబులై పొడమి తర్వాత చేపజల్లగుల్లగవ్వలాచు మొదలైన జలచరాది జన్మంబులెత్తి మఱియు ననేక మృగయోనులం బుట్టి మఱి మనుష్యజన్మంబుల కుంటి గుడ్డి కురూపి మూకాంధ చాండాలాది జాతుల దరిద్రులై తనువెత్తి పూర్వవాసనా వశంబున పాపంబులే చేయుచు మరలమరల నరకగామియై గమనాగమనంబుల నొందుదురు. ఇంక పుణ్యంబులు చేసిన వారు తత్పుణ్యంబుల కొలంది స్వర్గాదిలోకంబుల భోగం బనుభవించి పుణ్యశేషంబున లోకంబునకు వచ్చి యుత్తమజాతులం

దుద్భవించి సంపత్పరులై యుండి తద్వాసనా వశంబుల పుణ్యంబులే సేయుచు మఱల స్వర్గారోహణంబు సేయుచుందురు. ఈ రెండుపక్షంబులు వారి వారి తారతమ్యంబులు క్షత్రబంధుండు పుండరీకాది వృత్తాంతంబులయందు జెప్పచుందురు. ఎట్లు దగుల్కొట్లుకొన దలంచిన నేమి? అంబలి కఱవ క్రింది చిచ్చైన నేమి, పాయసపుకడవక్రింది చిచ్చైన నేమి? యినుప సంకిలైననేమి, బంగారు సంకిలైననేమి? పాపపుణ్యంబులు రెండు జన్మఫలదమేకదా! తత్పాపపుణ్యఫలప్రదంబులు విడిచి విరక్తులై భగవద్దయామూన స్వాంతుకక్రపచే దేవరవంటి సద్గురుం జేరి వచనభూషణనైభవానుష్ఠానంబుచే తరియించ వలయుజుమీ ॥నమోనమో శ్రీశఠకో॥ ౭౯

ముముక్షుజనబృంద కల్పవృక్షమా! యీభూలోకంబున జన్మించినవారికెల్లను పుణ్యపాపంబు లాచరించుటే విధి. వీనిలో నొక్కటి విడిచి యొక్కటిన నాచరించవలయు గదా! యీ రెండు విడిచి యెట్లుందు రని యవివేకత్వముచే శంకింతురు. వారికి దెలియునట్లు వివరించుమీ యని విన్నపంబుచేయ నంతట కరుణాకటాక్షులై యానతిచ్చుచున్నారు. వివేకులైనవారలు రెండు విడిచి సదాచార్యుల సన్నిధి నాశ్రయించి పంచసంస్కార సంపన్నులై యర్థపంచక జ్ఞానోపదేశంబుచే నాకార త్రయ సంపన్నులై తత్వత్రయ రహస్యత్రయ నిష్ఠులై యాచార్యులయందు భగవత్ప్రీతిపత్తి భక్తి సల్పుచు భాగవతాభిమానంబున నొదిగి వర్తింపుచు స్వయత్న ప్రయత్నంబులు

వదలి కింకరవృత్తిజేయుచు భాగవత కైంకర్య ముఖోల్లాసం బును నాచార్య తిరువడిగళే గతియని నిర్భయులై భగవద్గుణాను భవంబు తమకు వృత్తిప్రవృత్తులుగా తామున్నమట్టుకు గడవు వారు మోక్షాధికారులనిరి॥నమోనమో శ్రీశరణోపదేశికో॥ ౮౦

దాస్యరసంబుదెలుపు శ్రీవైష్ణవచూడామణీ! పంచసం స్కారంబు లెట్టివనిన నాచార్య శ్రీహస్తములచే తప్తముద్రాంక ధారణంబు నూర్ధ్వపుండ్రంబులు ధరియించుటయు దాస్య నామంబు నిడుటయు, వేదాంత రహస్యంబైన తిరువష్టాక్షరీ మంత్రోపదేశంబును సదాచార్యుని తిరువడిగళు నిరంతరంబు తిరువారాధనంబు చేసికొని తత్తీర్థప్రసాదంబులు పరిగ్రహించు టయు, భాగవతుల నాశ్రయించి వారిసన్నిధి దాస్యవృత్తు లాచరించి తత్పురుషకార వైభవంబుచే శేషి శేష సంబంధం బెఱింగి యశరణ్యశరణ్యత్వంబును ననన్యభోగ్యత్వంబును చరమోపాయనిష్ఠయు మొదలైనవి శ్రీవైష్ణవ సిద్ధాంతంబుచే గదా పరవాసుదేవుని సన్నిధి కైంకర్య నిర్భరానందపరవశ ప్రాప్తులై యుండుట. మీదాసదాసానుదాస దాసదాసత్వంబునను జమీ॥నమో నమో శ్రీశరణోపదేశికోత్తమా॥ ౮౧

శ్రీమదుభయ వేదాంతసిద్ధాంత ప్రవర్తకాచార్యా! శ్రీవైష్ణవాబ్ధి చంద్రోదయా! దేవర కృపావాత్సల్య సౌశీల్య సౌలభ్యాతిశయంబుల చేతనాచేతనుల నేలుకొనుట్లై పాదు కొన్న రహస్యం బెంతని చెప్పుట కలవియే శేషునకైన; దేవర యాజ్ఞానుసారియై విన్నపంబు చేసెద. హృదయంబున వసించి పల్కులుపల్కెడ వో యతిచంద్రా! అర్థపంచకజ్ఞానంబున

స్వస్వరూపంబు పరస్వరూపంబు ఉపాయస్వరూపంబు పురుషార్థ స్వరూపంబు విరోధిస్వరూపంబులు నివి యైదును నొక్కొక్కటి అయిదేసి విధములై యుండు; నెట్లన స్వ స్వరూపంబు నిత్యులనియు ముక్తులనియు కేవలులనియు ముముక్షువులనియు; పరస్వరూపంబు పరవాసుదేవుఁడు సంకర్షణాది వ్యూహపరిపాలకులైన రామకృష్ణాది విభవావతారంబులు అంతర్యామియైన శ్రియఃపతి అర్చావతారంబులు దివ్యతిరుపతుల విగ్రహంబులు; ఉపాయస్వరూపంబు కర్మజ్ఞాన భక్తిప్రపత్తి ఆచార్యసమాశ్రియణంబులందురు. పురుషార్థస్వరూపంబు ధర్మార్థకామ మోక్షంబు భగవత్ప్రాప్తియు నని చెప్పుదురు. విరోధిస్వరూపంబున స్వ స్వరూపవిరోధి పరస్వరూపవిరోధి ఉపాయస్వరూప విరోధి విరోధి విరోధిస్వరూపం బని తెలియవలయుజుమీ॥
నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౮౨

శిష్యచిత్తాపహారకా! యిట్టి యర్థపంచకంబం దున్న రహస్యధర్మం బెల్ల కృపజేసి రక్షించితిరి. పరమపదంబున పరస్వరూపుఁడైన శ్రియఃపతి ముక్తపురుషులకు భగవచ్ఛేషత్వంబు స్వాభావికంబగుట ముక్తావస్థయందు తచ్ఛేషత్వంబు పరమపురుషార్థంబు గావున శేషత్వంబున కించిత్కారము ప్రతిసంబంధి యగుటంజేసి నిత్యముక్తుల కైంకర్యరూపానుభవంబుగా భగవదనుభవంబు గృహీతంబై నిత్యయువ్వనలావణ్యాది గంధగణ్యంబై శ్రీ భూనీళాసమేతంబై పూర్వోక్తకారణ కార్యభావప్రతిమండల పరిభాగంబున శ్వేతాంగ శ్వేతజని యగు విరజానది కవ్వల త్రిపాద్విభూతియు సుప్రసిద్ధంబై జ్ఞానానంద

మయం బగు పరమైకశబ్దాభిధేయుండైన పరమపదంబునం దేజరిల్లు రూపంబు పంచోపనిషన్మయుండై పంచశక్తిమయుండై శుద్ధ సత్వమయుండై సముపాశ్రితాత్మీయసర్వశక్త్యాత్మకభూషణాయుత దివ్యభూషణధరుడై యఖిలయోగీశ్వరమునిప్రథమావలంబమై తద్దివ్యదేహంబు స్వహేచ్ఛంబున వెలుంగ భగవత్కల్యాణ విభవాతిశయంబుల నానాదిప్రకురు దేవరకృపచే నిట్టి వైభవంబు గలిగెగదా॥ నమో నమో శ్రీ శరణోపదేశిక స్వామీ॥ ౮౩

ముముక్షుజనచక్రవర్తీ! వ్యూహంబు లెట్లనిన సకలచేతనాచేతన సృష్టిపాలనసంహారయుక్తిగుణాకరంబు భక్తానుగ్రహ కార్యవిభవసరణియుంగా నిజేచ్ఛావశంబున గైకొన్న వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధు లనియెడి చతుర్విధభగవదవతార విశేషంబులందు వాసుదేవుండు జ్ఞానశక్త్యాదిషాడ్గుణ్య పరిపూర్ణుండై జగజ్జనన పాలనాది సంకల్పంబుచే గల్పించు సర్వకారణుండై బ్రహ్మాండావరణజలమధ్యంబున వటపత్రశయనుడయియున్న వైకుంఠుండనుట యిది ప్రథమవ్యూహంబు (త్రిలయకర్త్రి). సంకర్షణుం డన షడ్గుణంబులందు జ్ఞానబలైశ్వర్యంబులు ప్రాధాన్యంబులుగా గాని సర్వజీవతత్వంబునకు నధిదైవతండై దానిం బ్రకృతివలన నేర్పరించుట ప్రయోజనంబుగా నాత్మవిభూతులగు రుద్రయమవహ్నికాలాదు లగు నఖిలప్రాణుల యందు నధిష్ఠించి క్రమక్రమ యుగసంహార కారణుండై తమఃప్రవర్తకుండై సత్యలోకోర్ధ్వస్థానంబున బ్రహ్మకల్పరాగస్థలం బగు వైకుంఠంబు నిచ్చు నిది ద్వితీయంబు; (త్రిసృష్టి), ప్రద్యుమ్నుం డన నైశ్వర్యాదిగుణంబులం గాని

మనోబుద్ధ్యహంకారచిత్తంబు లంతఃకరణచతుష్టయంబుల నధిష్ఠించి ప్రకృతి బుట్టింపుచు నాత్మవిభూతి యగు చతుర్ముఖు నధిష్ఠించి శుద్ధసృష్టికర్తయై సకలప్రాణులకు నుత్పత్తి హేతుభూత సంకల్పంబులు పుట్టించుచు క్రమక్రమయుగ సృష్టి సేయింపుచు శుద్ధజలార్ణవోత్తరతీరంబున వైకుంఠంబున నుండు నిది తృతీయంబు (స్వయమేవస్థితికర్త్రి), అనిరుద్ధుం డన శక్తితేజోయుక్తుండై సకలజగదాపదోద్ధారణార్థంబుగా తత్ప్రదేశకాలంబుల దేవమనుష్యతిర్యగాది ముఖ్యజంతువులం గైకొని రక్షణంబుసేయుచు మిశ్రసృష్టికాలసృష్టిచే తత్వబోధంబు లొనరింపుచు మన్వాదులకు నాత్మీయమైన శాస్త్రప్రవర్తకుం డగుచు రక్షణోపాయమై క్షీరవారాశి లోనుండై యుండుట యది చతుర్వ్యూహంబందురు॥ నమో నమో శ్రీ శఠగోపదేశికోత్తమా॥ ౮౮

సుభద్రినాంచారమ్మగారి మానసోల్లాసా! వ్యూహంబు లెట్టివన వ్యూహాంశంబులచే దుష్టనిగ్రహశిష్టప్రతిపాలన ధర్మసంస్థాపనంబులు చేయుకొఱకు నయ్యయికాలంబున నాయాయుగంబున దేవతిర్యఙ్మనుష్యాది రూపంబుల నవతరించుట విభవావతారంబులు. ఆయా యవతారంబుల ముఖ్యంబులు. వామన త్రివిక్రమావతారంబులు విశేషంబులు. నారసింహరామకృష్ణాద్యవతారంబులు పూర్ణ షాడ్గుణ్యంబులు. మత్స్యకూర్మ వరాహావతారంబులు తత్వద్వయంబులు గాన విశేషావతారంబు లందురు. వ్యాస జామదగ్ని ప్రభాకర నారదాదు లుద్భవంబైన యర్థం బేతదంశంబనుటకై తత్తదధికారాత్మలందు

నావేశించి చేయవలసిన చారిత్రంబులు ఘటింపజేసి వారెల్ల నావేశావతారంబులు. విభవంబు లనంతంబులు. అందు ముఖ్యంబు లివి యుందురు॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౮౫

ఆళ్వారు ముఖ్యప్రదాయకా! అంతర్యామిత్వప్రభావం బెట్టి దనిన 'అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః వదంతి సకలావేదాః' పూర్వోక్త సకలాంతర్బహిర్వ్యాప్తప్రధాన. పరబ్రహ్మస్వరూపంబు నారాయణతత్వంబే యని ఆరూఢానుష్ఠాన నిష్ఠాగరిష్ఠుల హృత్పుండరీకమధ్యపీఠంబున శంఖచక్రగదాధరనై జయంతీ వనమాలికామకుట చూడావతంసాది దివ్యాభరణ దివ్యమంగళవిగ్రహుండై ప్రసన్నీకరించెడు విరాజమానరాజిత దివ్యపురుషుండును భక్తవత్సలుండును భగవంతుడును అర్చావతారవిభవం బెట్టిదన్న బహుశిలాలోహాదారుల శిరోలలాట వక్షుపాణిపాదాదికలితంబైన విశ్వరూపంబు; లివి జితేంద్రియ విముక్తప్రాయుడైన వసిష్ఠ వాసుదేవ మహర్ష్యాది భావ్యంబులై యుండును. స్వయంవ్యక్తంబులగు స్థలంబులు దేవతా ప్రతిష్ఠంబులు, ఆర్షంబులు, మనుష్యప్రతిష్ఠంబులు కొంత బఱగియుండు. స్వయంవ్యక్తస్థలంబులు దేవ ఆర్ష మనుష్యాదుల కాశ్చర్యప్రభావంబులచే దరింప జేయుచుండు. మానుషప్రతిష్ఠాది స్థలంబుల భక్తపురస్సరంబులు గల భక్తుల యభిమతంబు లీడేర్చు బద్ధముక్తులు మొదలగువారల కందరికి భక్తిపూర్వకంబు ప్రాధాన్యంబు. భక్తిర్భాగవతార్చనంబను ప్రమాణ ప్రవచనంబు ప్రసిద్ధఫలభరితంబు, దేవర కృపవల్లనే కదా॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౮౬

రామానుజమ్మగారి హృత్కమలకర్ణికా మధ్యనివాసా! దేవర పురుషకారనై భవబల సంపన్నతచే గలిగిన విన్నపంబులు చేసెద. 'యతో వా ఇమాని భూతానిజాయంతే ఏన జాతాని జీవంతి' యను శ్రియఃపతి పరమపదంబున ననంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరి పరివారవర్గంబులచే నానందమయుండై అనంతకల్యాణగుణాకరుండై నిఖిల హేయప్రత్యనీక భోగ లీలార్థవిభూతిద్వయైశ్వర్యుండై యత్యద్భుతాశ్చర్యగుణ చేష్టితనై భవంబుల ననంతకోటి బ్రహ్మాండంబులు సృష్టిస్థిత్యంతకారణ కార్యాంతరాత్మయై చరాచరాది జీవకోట్ల జంతుజాలంబులం దంతర్యామియై తా నుండుచు దనయందు నవి యుంచుకొనుచు వ్యాప్యవ్యాపక సంయుక్తుండై పృథక్స్వభావండై శ్రీమన్నారాయణాహ్వయుండై తత్వతః వేంచేసియున్న స్వామీ స్వామి త్వం బ్రహ్మాస్థితంబని యరుళ్ పొరుళ్ దేవరవారి దివ్య తిరువడిగళ సంబంధ సంబంధసంబంధాది దాసులైన శ్రీమహాభాగవతోత్తములకు లభించు పరమపద విభవాతిశయ ప్రాప్తులగుదురని విశిష్టాద్వైతంబందె తత్వత్రియ సిద్ధాంత ప్రతిపాదిత ప్రవర్తకాచార్యోభయవిభూతినాయకులయి చేతనాచేతన కోట్యుద్ధారకులైన శ్రీభాష్యకారప్రోక్తంబైన శ్రీభాష్యాది సూత్రంబులు స్కంధమూల ప్రమాణంబులే యని పరంపరాచార్య పూర్వోక్తంబులై తత్వత శ్రీమద్రామానుజులు మోక్షప్రదాతయై యతిసులభుండై శ్రీవైష్ణవశిష్టాచార నవవిధ సంబంధాది నిష్ఠాగరిష్ఠార్యవంశోద్ధారకులై శ్రీపెరుంబూదూరి యతిరాజచంద్రుల దివ్యతిరువడిగళ సంబంధ సం

బంధ సంబంధాదుల పదపంకజము లాశ్రయించి కడతేరుట కిది మంచికాలం బని యెఱుంగని మూఢమతుల నెల్లు కడతేర్చెదరో॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౮౭

పురుషకార వైభవోద్ధారకా! పురుషార్థం బెఱింగించెడి దేశికోత్తములు మీరేగదా తత్వత్రయంబు పరమేకత్వంబైన యీశ్వరునకు బృథక్సిద్ధవిశేషత్వయంబు చిత్తునచిత్తు నని రెంటి యందు చిత్తత్వజ్ఞానశూన్య వికారద్రవ్యంబులంది శుద్ధ సత్వ మిశ్రసత్వ సత్వశూన్యంబై యిట్లు త్రివిధంబై యుండు. మిశ్రసత్వంబు రజస్తమస్సులం గూడి కర్మబంధ జన్మసంబంధ స్థానంబై జగదాదికారణంబై సితాసితరక్తవర్ణంబై సూక్ష్మం బై, నిత్యంబై, జన్మనాశరహితంబై, చైతన్య శూన్యంబై, యీశ్వరునకు నిత్యక్రీడోపపరికరంబై, భక్తవర్గంబునకు భగవ త్స్వరూపజ్ఞానానందతిరోధారకంబై, మహదాదికారణ వికా రంబై యుండుటే ప్రకృతి యన నమ్యక్జ్ఞాన విరోధియగుట నవిద్యయన విచిత్రసర్గ కారుణియగుట మాయయన హేతు వగుట నమోహజనకంబగు మోహిని యనంబరగు పెక్కు నామంబుల బ్రఖ్యాతంబై యుండు చతుర్వింశతి తత్వాది భేదంబుల ఆత్మా మనసా సంయుజ్యతే మను యిందిర్యేణ (ఇందిర్యమర్థేన) యిట్లుపరిణమింపుచు ననంతకోటి బ్రహ్మాం డంబుల కుత్పత్తిసంహార ప్రదేశంబైన విషమకారణపరిణామక మేకదేశంబై మహార్ణవంబునం గనుపట్టు చలితాప్రదేశంబుల చందం బుక్షితంబగు నదే మిశ్రసత్వంబందుర॥ నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా। ౮౮

కూరేశాది శిష్యపూజితా యింక శుద్ధసత్వరూప వివరణంబు విన్నవించెద రజస్తమస్సులంగలయుక సదాచార్య తిరువడిగళాశ్రయించి (గురుసేవపరంధనం) బను నిరర్థకత్వాను పూర్వకమున నుకారవాచ్యుడైన యాచార్య కటాక్షంబున బంచ సంస్కార సంపన్నుడై సకల వేదవేదాంతసార సంగ్రహంబైన మూలమంత్రంబను తిరునష్టాక్షరి లభించికొని యందర్థవివరణ శ్రవణ మనన నిర్ధారణత్వంబు పురుషకార పూర్వక మూలకంబుచే భాగవతధర్మా బనువర్తించి తద్దాస దాస శేషత్వాను సంధాన రహస్యంబు లభించుకొని ప్రకృతి వికార వాసనాదూరుడై యెంబెరుమానారు తిరువడి గళేతంజంబను కేవల సత్యజ్ఞానానంద జనకమై భగవద్భాగవతాచార్య సన్నిధి కైంకర్యవిభవంబులచే జెలంగి మెలంగుచే శ్రియఃపతి పరిపూర్ణ కృపాకటాక్షంబుచే పరమపద ప్రాప్తుడై యనంతగరుడ విష్వక్సేనాది నిత్య సూరిపరివారవర్గ సంయుక్తుడై శ్రీభూనీళాది నాయకుసత్సేవానంద పరత్వవైభవ సంపన్నత్వంబుగల్గి యుండునని దేశికోత్తములు పూర్వప్రమాణంబులం దెల్పుచు నింక సత్యశూన్యమైనది యాప్రకృతి ప్రాకృతములు పరిణామములు వీనికి గళాకాష్ఠాది కాలవ్యవహార పరిమాణ రూపంబులు నిత్యానిత్యమై యీశ్వరునకు నివి కందుక క్రీడా పరికరంబై, శరీరభూతంబై, విభూతి ద్వయంబై, యిట్టి కాలంబంతట ప్రసరించి యుండును బరమపదంబందు నిత్యము తక్కిన స్థళంబులెల్ల ననిత్యమనియు శుద్ధసత్వ తత్వ సిద్ధాంత శూన్యప్రకారంబు ॥నమోనమో॥

అళగసింగరి కృపాలబ్ధ ప్రసన్నార్యా స్వస్వరూప పర స్వరూప పురుషార్థ పంచకస్వరూపానుభవవిభవ బోధశరణ్యా శుద్ధతత్వంబైన, శ్రీమన్నారాయణుని సంకల్ప మాత్రంబున చిత్త నజీవాత్మన క్షేత్రజ్ఞుండన, పురుషుండన, చేతనుండన నామంబులు గలిగి దేహేంద్రియ మనఃప్రాణబుద్ధివిలక్షణుండై అజడమై, యానందరూపమై, నిత్యమై, నిరవయవమై, నిర్వికారమై, అణువై, అచింత్యమై, అవ్యక్తజ్ఞానాశ్రయమై, స్వయం ప్రకాశమై, ఈశ్వరనియామ్యమై, శేషమై యుండు సర్వదేహంబులందుండి ఛేదన దహన దండతాడన శోషణాదుల బొందనివాడై యొకడుగాక నిత్యముక్త కేవల పండిత బద్ధరూపంబులై యనంతంబులై మణిద్యుమణి దీపాదులంబోలె హృత్పద్మమందుండి శరీరమెల్ల వ్యాపించి సుఖదుఃఖాదు లెఱుంగువాడై, యుండియు స్థూలగతంబైన జలమునకు నగ్నిసంస్పృష్టాది సంసర్గములచేత నౌష్ణ్యశబ్దాదులు గలిగినట్లు అవిద్యాకర్మవాసనాదులచే ననాద్యచిత్సంబంధ దేహాభిమాన మమకారాది ప్రకృతివికార తాపత్రయాది దుఃఖసంతప్త జన్మమరణాది క్లేశంబుల బీజాంకుర న్యాయంబున సంసారంబె కులాలకచక్ర భ్రమణ భ్రమ్యంబు దెగవేయుట దేవరదివ్య తిరువడిగళ దాసకైంకర్యరుచి ప్రాప్త యడియనికి లభించెగనుక నిందుకు సమవాయంబు దేవరవేకదా ॥నమోనమః శ్రీశఠకోపదేశికా॥౯౦

సత్యసంకల్ప స్వరూపా శిష్యపుత్రవాత్సల్య కరుణా కటాక్షా అకారవాచ్యుండనైన దేవరవు జ్ఞానానందమయుండవు మకార వాచ్యుడైన యడియని ప్రకృత్యావరణంబు దొలం

గించి శేషి శేష సంబంధంబున వన్యశేషంబు బాల్పడకుండ ననన్యార్హత్వంబు దెలిపియు కారార్థంబున నిలిపి చేరందీసి లుప్తచతుర్థియర్థంబున కైంకర్యంబు నియమించి మంత్ర మంత్రార్థ వివరణ పూర్వకంబుగా దారకపోషక భోగ్యభోక్తృత్వ వ్యాప్య వ్యాపకత్వ సకల జగత్కారణత్వ సర్వవిధ బంధుత్వ ప్రాప్య ప్రాపకంబులం దెలిపి అయనపద వాచ్యుండైన, యీశ్వరుండు నారపదవాచ్యుండైన యడియ్యనియం దనన్యార్హ కృప గలిగి దేవర తిరువాతార ప్రసన్నంబున వీనిదోషంబులెల్ల భోగ్యపఱుచుకొని పంచమోపాయ నిష్ఠం దెలిపి నమః పదంబున నిలిపి స్వాస్థ్యుచేసికొని యాయపద కైంకర్యపరునిగా గైకొని, సర్వశబ్ద జనకంబగు నకారంబు వానితండ్రియై పరమ పురుషార్థం బెఱింగించు నుకారంబుచే దల్లియై యవరక్షణేయను ధాత్వర్థంబునరక్షకుండవై లుప్తచతుర్థిని శేషివై, యకారంబున భర్తవై మకారంబున జ్ఞాతవై, నమఃపదంబున స్వామివై, నారపదంబున శరీరివై అయనపదంబుచే దారకుండవై, ఆయపదంబున భోక్తవై యట్టి నవవిధసంబంధంబులందు దాసుని లాలించి తేలించి, గారవించి కైకొన్న యుపాయస్వరూప ప్రభావ ప్రభలు వెలుంగు దేవరయందే ప్రత్యక్షంబయ్యె ॥నమో నమో శ్రీశఠ॥ ౯౧

కకుత్స్థతిలకాంశ సంభవా యీశ్వరుండఖిల కల్యాణ గుణాకరుండు నిఖిల హేయప్రత్యనీకమూర్తి చతుర్విధ భక్త పాలనాశ్రియుండై ధర్మార్థకామ మోక్షఫల ప్రదవిలక్షణ విగ్రహాయుక్తుండై శ్రీభూనీళాది నాయకుండై యనంత గరుడ

విష్వక్సేన శంఖచక్ర గదాశార్ఙ్గాది దివ్యాయుధ సంయుక్తుండై శ్రీవత్స కౌస్తుభ వనమాలికాధరుండై నిత్యసూరి పరివారవర్గ సేవితుండై, చిదచిత్ప్రత్యనీక శేష శేషియై నిత్యముక్తాను భావ్యుండై పురాణ పురుషోత్తముండై వేదాంతవేద్యాచార్య పరంపరాఖ్యుండై, పరమపదంబున శ్రియఃపతి దశాద్వయ క్రీడావిలాస ముఖోల్లాసియై వేంచేసియున్న స్వామియీ చిద చిద్విశిష్టుండని చెప్పినవేదంబు బ్రహ్మాయద్వితీయంబని చెప్పు టెట్లని కొందరు క్షుద్రదృష్టులు శంకింతురు ఈశ్వర సదృశ వస్తువు సంకల్ప మాత్రంబుననే యుండునేమని గ్రహింపవలయు భగ వంతుని పరబ్రహ్మ మేయని శ్రుతిమరల మాత్రంబని చెప్పు టెట్టిదని కొందఱవివేకులు పలుకుదురు జడభావహీన మనుట స్వామిత్వమని యెఱుంగవలయు శ్రీమన్నారాయణుండ వ్యాప్త సమస్తకాముండనియే వర్ణించుట యెట్లన్నను బరమాత్మకు గర్మకార్య దేహంబు లేవని తలపవలయు వాసుదేవునకు వైష మ్య నైర్ఘృణ్యంబులు లేవని బోధించు శ్రైయంత్యంబులుండ గాస్వామి విషమసృష్టి జేయుట యెట్లన్నను జీవులవిద్యా కర్మ వాసనావిరచితంబని తలపోయవలయు నవిశ్రుతులవమో భయా ర్థంబని చెప్పుదురు ॥నమోనమో శ్రీశఠకోపదేశికా॥ ౯౨

తామ్రపర్ణీతీరజననా సర్వ రక్షకత్వ సర్వ కారణత్వ సర్వశేషిత్వ శ్రియఃపతిత్వంబులం జెప్పు నకారవాచ్యుండవైన దేవరవు జ్ఞానానందత్వ జ్ఞానాగుణత్వ అణుత్వ యేకరూపత్వ నిత్యత్వ స్వస్మైస్వయంప్రకాశత్వ నియామ్యత్వ ప్రకృతి పర త్వంబులం జెప్పు మకారవాచ్యుండవైన యడియని ప్రకృత్యా

వరణంబు ననన్యశేషంబువాలై పోకుండ ననన్యా రత్వంబు దెలుపును కారాన్వయంబునను నిలిపి లుప్త చతుర్థ్యర్థంబైన కైంకర్యంబున నిలుపుము మంత్రశేష వివరణంబైన, ధారకత్వ వ్యాపకత్వ సర్వజగత్కారణత్వ సర్వసిద్ధబంధుత్వ నియంతృత్వ ప్రాప్యప్రాపకంబులం జెప్పు నయినపదవాచ్యుండవైన దేవరవు చేతనాచేతను లనిత్యత్వ సమూహాత్మా సంఖ్యాతత్వంబులలో నొక్కండవై నారపద వాచ్యుండనైన యడియని స్వహంకార మమకారంబుల జెడకుండ నత్యంత పారతంత్ర్య పరకాష్ఠ తదీయ శేషత్వానురూపోపాయంబులం జెప్పు నమః పదంబు నిలిపి-ఆయపద కైంకర్యంబున దిక్కైనను సర్వభజనకంబైన యకారంబునగండ్రినై తదావరణంబను ధాత్వర్థంబు రక్షకుం డవై లుప్తచతుర్థివలన శేషివై యుపకారంబున భర్తవై మకారంబున జ్ఞేయమైన మనస్సున స్వామివై నారపదంబున శరీరివై యయనపదంబున ధారకుండవై ఆయపదంబున భోక్తవై యిట్టినవవిధ సంబంధంబుల యందు నకారాయనపదంబుల పరస్వరూపంబున దేవరవు మకారనార పదంబులయందు స్వస్వరూపంబు దెలయని యడియనిని అన్యశేష మమకారంబులం జెడకుండ విరోధి నడంచి యుకార నమఃపదంబులంగల యుపాయస్వరూపంబునం బెట్టి లుప్తచతుర్థ్యాయ పదంబునంగల పురుషార్థపరునిగాజేయవే ॥నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥3

శ్రీకాకుళనివాసా చరమశ్లోకంబందు బూర్వార్థోత్తరార్థంబులైన చేతనకృత్యంబీశ్వర కృత్యంబులు రెంటి యందును దేవరవే రక్షింపవలయు - గాని చేతనకృత్యంబు నడుప నడియ

నికిం దీరదు అదియెట్లనిన సర్వాన్ ధర్మాన్ బహువచనంబులం గల పుణ్యపాపంబులను పరిత్యజ్య లేవులంగలట్లు అడియని నీవే విడిపించి మాం అన్న దేవరవు ఏకం అన్న ముఖ్యరునిచే శరణముపాయంబుగాను వ్రజ అన్నట్లు పొందించుమా అహం అనబడు దేవరవు త్వాం అనబడు అడియనిని సర్వపాపేభ్యో అను ప్రాప్య ప్రతిబంధకములైన పాపములను మోక్షయిష్యామి అన్నట్లు విడిపించి మాశుచః అన్నట్లు దుఃఖనివృత్తిం జేయుమీ యిట్టి చేతనకృత్య - మీశ్వరకృత్యంబులు రెంటను దేవరవే రక్షించవలయుంగాని అడియనిచేత గాదనుమీ ॥నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౯౮

ప్రకృతి గుణవత్తద్వయవివరణంబైన పదియుంబుల యందును స్వామిత్వ వాత్సల్య సౌశీల్య సౌలభ్యాదులంగల నారాయణపదవాచ్యుండవైన దేవరవు శ్రీవాచ్యంబైన నిత్యానపాయినియైన కృపతోడను మతుప్పు వివరణంబున నెడబాయక కూడియున్న వారవై చరణశబ్దంబైన దేవర తిరువడిగనైన దివ్యమంగళవిగ్రహమును శరణవాచ్యంబైన యుపాయముగాను ప్రపద్యేవాచ్యంబుగాను అడియనిపొందించుమా శ్రీమతేయన్న కృపతో నెడబాయకయున్న నారాయణయను నుత్తరవాక్యంబై యనంతకల్యాణగుణ పరిపూర్ణంబై దేవరకృపయనియెడు మిథున చైత్రియందు ఆయపద వాచ్యంబైన కైంకర్యబును నడియని చేతవృద్ధి బొందించుకొనుము. ఆకైంకర్యారంభం బందు నుత్తర నమఃపద వాచ్యంబైన యహంకార మమకారంబను గలువు

దీసి దేవరనడియనిచేత దాస్యంబుకొన నవధరించి రక్షించుము
॥నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౯౫

ఈశ్వర పూర్ణావతార పూర్వకాలంబున శ్రీకృష్ణ
భగవానులచేత గీతశాస్త్రంబున జరమశ్లోకసారార్థంబున బోధిం
పంబడిన యర్జునుండు తదర్థంబు మనంబునం బట్టక భారత
రణాంతంబున కృష్ణదేవుంజూచి యుద్ధంబునకు మొచ్చినప్పుడు
మీరుచెప్పిన వాక్యంబులు మనంబున నిల్వదయ్యె దిరిగియాన
తిమ్మనిన సర్వేశ్వరుం డితండు భాగ్యహీనుండని యుత్తరగీతా
గమనంబునం బట్టు శ్వేతవాహనుండదియు గ్రహింపనేరక ద్వాప
య జన్మంబున గాంచీపురంబున మూగవైష్ణవుండయిపుట్టి యెం
బెరుమానారు కటాక్షంబున బరమపదంబుజేరె దేవరమహా
త్మ్యంబు విచారించిన స్వామిచేత బరమార్థంబు బోధింపబడిన
యనంతశిష్య సంఘంబులు తిరుగ బడక దృఢచిత్తులై తిరుగ
బడని పరమపదంబున నసింతురు విశేషించి రాజసకులంబున
బుట్టి దుర్మదుండన్న దురాచారియై యభిమానియై హీనాగ్రేస
రుండనైన యడియని నిజరమబోధంబున దాస్యధర్మంబున నిలి
పితిరి యెంత మహానుభావులో ॥నమోనమో శ్రీశఠకో॥ ౯౬

ప్రతివాది భయంకరాపర్వతంబైన నారాయణుండే
దేవరవై యవతరించుట సిద్ధంబది యెట్టిటిరా విస్మయంబుచే
సెద నతండు భక్తవత్సలుండు దేవరవు శిష్యవత్సలుండవు అతం
డు ప్రహ్లాదనారదాది పరమ భాగవత సేవ్యుండు దేవరవభ్యాసను
కూరేశాది పరమవైష్ణవ సేవ్యుండవు అతండు కఠిన రాక్షస
విధ్వంసనుండు దేవరవు కుటిలమత విధ్వంసనుండవు అతండు

లక్ష్మీసహాయుండు దేవరవు లక్ష్మీనాంచారు సహాయుండవు అతండు మాయాతీతుండు దేవరవు మాయాదూరుండవు అతండు మత్స్య కూర్మవరాహాద్యవతారంబుల నుద్భవించె దేవరవు శఠకోప యతిరాజవర వరాకారంబుల నవతరించిరి. అతండు గుణహీనుండు. దేవరవు హేయగుణ రహితుండవు. అతం డనంతకల్యాణగుణ పరిపూర్ణుండు. దేవర వనంతకల్యాణ గుణ సమర్థుండవు. అతండు కపటనాటక సూత్రధారియై విహరించు; దేవరవు కపటరహిత సూత్రంబున విహరింతువు అతండు బ్రహ్మగారడి విద్యవాడు దేవరవు బ్రహ్మగారడివిద్య లిట్టివని యెరుంగుదువు అతండు శంఖ చక్రాది పంచాయుధా ధరుండు దేవరవు శంఖచక్ర లాంచనధరుండవు అతండు సామ గానప్రియుండు దేవరవు తిరునామ గానప్రియుండవు అతండు లీలావినోది దేవరవు లీలావినోదంబులందగలవు అతండు భగ వంతుండు దేవరవు భగవద్విషయ వేత్తవు అతండు చతుర్విధ పురుషార్థ దాయకుండు దేవరవు చతురాక్షరీ మంత్రార్థదాయ కుండవు అదిగాన నిట్టి గుణంబులవలన శ్రీహరి వేనీవని తెలియం బడుచున్నది ॥నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౯౭

దాసనేత్రోత్పలచంద్రబింబాననా మీరు పరవాసు దేవులు మీరుండెడు శ్రీకాకుళంబు పరమపదంబు మీ దివ్య తిరుమాళిగ తిరుమామణిమంటపంబు మీ దివ్యసన్నిధి లక్ష్మీ నాంచారు, రామానుజమ్మ, పురుషోత్తములు శ్రీ భూనీళాపిరాట్టి యారులు పెరుమాళ్ళయ్య యనంతాళ్వారులు సన్నిధి కృష్ణమ్మ గరుడాళ్వారు రంగప్పగారు విష్వక్సేనాళ్వారు నిమ్మయ్య సేనాని

తర్వాత గణనాయకులు పోతకమూరి పురుషోత్తమ కూరేశులు జయవిజయులు నంద బాలాది వాసులు చండప్రచండు లెంబా రులు దాసపోతకమూరి జగన్నాథులు తుంబుర నారదాదులు మరియూ తత్పట్టణవాసులైన తిరునామధారులు పరమపద సేవకాగణంబులు అందున్న నాచ్యమారులు సూత్రవత్యాది నాచ్యమారులు కులశేఖ నమ్మయూళ్వారు వ్యూహాపరిపాల కుండైన వాసుదేవుండు కూరేశయ్యగారు సంకర్షణాభిధానులు ఆళ్వారు ప్రద్యుమ్నులు ధీవి కృష్ణమాచార్యులు అనిరుద్ధులు మరియు దూరస్థుల శిష్యసమూహముఖ్యులు దశావతారానం తావతారంబులు మీరు ధరించిన జలతారుకుళ్ళాయ దివ్య కిరీటంబు, మీరు పెట్టిన కుండలంబులు మకర కుండలంబులు, మీరుకట్టిన దివ్య పరివిటంబులు పీతాంబరంబు మీరు కట్టిన సూత్రంబు దివ్యకటిసూత్రంబు, మీ తిరువడిగళు దాసులకు బ్రావ్యప్రాపకంబులు మీ మృదుమధుర భాషణంబులు సర్వ వేద సారార్థంబు లిట్టి తిరువడిగళ సమ్మందుడనై, దేవర దాసానదాస చరమావధి దాసుండనై తి నడయనిభాగ్యం బేమని పొగడెద ॥నమోనమో శ్రీశరకోపదేశికోత్తమా॥ ౯౦

దాసవందితపాదాంబుజాతా మీ పాదాంబుజంబులకు వందనంబు మీ చరణద్వంద్వంబులకు నమస్కారంబు మీ యడుగుదమ్ములకు దండంబు మీ యంఘ్రియుగ్మమ్ములకు జోహారు మీ యవయవంబులకు బుష్పాంజలి మీ రక్షకత్వంబునకు శర ణార్థి మీ స్వామిత్వంబునకు బొలిగ మీ వాత్సల్యంబునకు మొక్క మీ సౌశీల్యంబునకు మొగుడ్పులు మీ శాంతశమ

దమాది గుణంబులకు సంతత ప్రార్థన మీ దయాళుత్వంబునకు నడియెడను మీతిరువడిగళకు ననుదినం బనంతంబులు సేవించెద. స్వామీ యడియని విన్నపంబులు నేర్పు నేరంబులేమిగల్గినను జనకుండు ముద్దులబాలుని తప్పుమాటలకు సంతోషపడినట్లును పతి ప్రియసతి ముగ్ధాలాపంబులకు నానంద కందళితాంతరంగుండైన యట్లును గృహస్థుండు తాబెంచిన చిలుకపలుకులకు సంతోష స్వాంతుండైనట్లు దాసుని విన్నపంబుల తప్పుక్షమించుము॥ నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౯౯

శ్రీమద్బుక్కపట్టణ తిరుమల శ్రీనివాసాచార్య పాదాంబుజాత మకరందపాన మధువ్రతా పరమగురు వేంకటాచార్య పాదాబ్జ ప్రతిదిన భావనాసక్త తిరుమలా నంతాచార్య స్వయ తిరువడిగళ సంబంధమన నాళమహాముని సాంప్రదాయ మందారకా యతిశేఖర పదద్వయ దాస్య సుధావారాశి చంద్రోదయా శ్రీపరాంకుశ దివ్యావతార శ్రీమన్నారాయణ చరణ కమల ధ్యానపారాయణా దీవికృష్ణమాచార్య కవితాకన్యకా ప్రాణనాయక రామాయణ వేంకట పతివాక్పూజితా అస్మ ధ్యానగోచర దివ్యమంగళ విగ్రహా దాసజనవత్సలా దయా గుణసాగరా మూఢజన జ్ఞానదానప్రదా శ్రీవచనభూషణ శాస్త్ర వ్యాఖ్యాన ధురంధరా పూర్వాచార్య సద్గోష్ఠిసల్లాప విచార నిపుణా ద్రావిడామ్నాయ పరిశీలన విచక్షణా భగవద్విషయాను భవ కాలక్షేప మదీయపురుషకార రామచంద్ర కూరేశాది భాగవతజన మనోల్లాసా పరాంకుశ పరకాల భాష్యకార భక్తి సారాది దివ్యముని ప్రబంధ సారార్థాను భవకుతూహల శిష్యజన

భావిత కోమలమృదు పాదారవింద కనకరంభాతి తిరస్కారోరు కాండ కావివస్త్రావరణ కటిస్థల గంభీరనాభీనమేత దివ్యోదర మృణాల తంతుసంతాన శోభిత ధవళయజ్ఞోపవీత సమేత విశాలవక్షస్స్థల తులసీ నలినాక్షమాలికాలంబిత కంబుకంఠ సంపూర్ణ చంద్రమండల నిరాకరణవిలాస ముఖపంకజా ఊర్ధ్వపుండ్ర శ్రీచూర్ణధారణ లలాటఫలకాలంబ మానశిఖాసమేత రత్నకుళాయిధారణా యుత్తమాంగ దయారస బిందునందోహ కటాక్షవీక్షణా యతి మృదుమధుర చమత్కార భాషణా సంపూర్ణావయవా అప్రాకృత దివ్యమంగళవిగ్రహా శ్రీపరవాసుదేశ నియమిత సమస్తచేతన సంరక్షణార్థావతారా ప్రణవ గర్భీకృతమకార సేవితాకార వాచ్యస్వరూప మంత్రశేష నారవద స్థానాయనపదవాచ్య విగ్రహాజయా విశ్లైభవా దిగ్విశ్లైభవా దేవరకు ననంతంబులుగా సేవించెద. నడియుని విన్నపంబు లాలకించి రక్షింపుము!నమోనమో శ్రీశఠకోపదేశికోత్తమా॥ ౧౦౦

శ్రీశఠకోప యోగివరేణ్యా మీరు ప్రసాదించిన మూలమంత్ర ప్రణవంబు లెనిమిది యంగంబులై నాలుగుపదంబులై మూడుస్థానంబులై యయిదు వేల్పులైన పరబ్రహ్మంబునం బొందువారు జీవన్ముక్తులని ప్రమాణింతురు. అదియెట్లన్నను (అష్టాంగాశ్చ తుష్పాదా స్త్రిస్థానం పంచదేవతాః ప్రణవంయోభిజానాతి పరబ్రహ్మాధిగచ్ఛతి) (యనియున్నట్లితనికి భయంబునొర్చి చక్రరూపంబు మెరయ ఓం కృతంబు ధరియించి బిందువు సంయోగించి తాబందోత్తమున గ్రొర్యశూన్య మంబున గూడంబలికి) మీరందుకొని చుట్టుపట్టుచేర్చి పలుకుచు

మూలమంత్రియోగంబు ముప్పిరిద్వయమై తదాకారమై యటుక్క భేదంబున నారాయణ వ్యక్తులం బొంది సదావ్యా ప్తంతిసూరయ యనిమెడి జ్ఞానమున గడతేర్చి రక్షించిరి నమో శ్రీశఠకోప గురుః పరాంకుశా జీవుండు మాతృ గర్భనంబైన లక్షణంబుల గంటి వాజనకుని వీర్యంబును జనని రక్తంబును గూడి యండమైన పిడంబాయను అట్టిపిండం బునకు చర్మరక్తమాంసమందు శుక్లంబులనియెడు సప్తధాతు వులు గూడి కరుడుగట్టియేర్పడి యాజీవుడు నప్తమాసంబులకు బరిపూర్ణుండై యుండు నిట్టిజీవునికి వ్యాధిరూపం బేలాగంటివేని యట్టి పిండంబునకు మాతృగర్భంబుననుండి పంచమ మాసంబున బనరుభక్షించిన శ్లేష్మశరీరియగును సప్తమమాసంబున దధ్యా న్నంబు భక్షించిన నిర్మలశరీరియగును అష్టమమాసంబున సతిపురుషులుగూడిన వీర్యంబుభక్షించిన మహాపాపకర్ముడగును నవమాసంబునగూడిన పిండంబుమృతిపొందును అట్టిరక్తంబున సంక్షిప్తంబై జన్మించిన బహువ్యాధులబొందు నుదయకాలంబున జన్మించిన సాత్వికుండగును మధ్యాహ్నంబున దుష్టుండగును నస్తమయకాలంబున జన్మించిన నసురరూపు వాడగును రాత్రి నరిపొద్దున జన్మించిన సకలరాజ్య సంపన్నుండగును వేకువ జామున దీర్ఘాయుష్మంతుడగును నిట్టిబాలునికి పాపంబులు వ్యాధులు లేకయుండును పరగృహంబులనగ్ని నంధించిన మను జుండుత్కృష్టదోషంబున నుత్కృష్టవ్యాధిపీడితుండై జన్మించును జననీజనకులకు నన్నవస్త్రంబు నడపనిమనుజుండు చలివేకిగల వాడై జనియించును గోబ్రాహ్మణుల వధించిన మనుజుండు

పిచ్చుకగూడై జనియించును బహుగోవుల సంపాదించి వాని
నాదరించలేని మనుజుండు గూబయైజనియించును అన్నదాన
పరుండుగానిమనుజుండు దరిద్రుడై జనియించును అన్నదానము
మీద నధికారియైనమనుజుండు శునకంబై జనియించును
ధాన్యంబు మీదనధికారియైన మనుజుండు గర్దభంబై జని
యించును వస్త్రంబునకు నధికారియైన మనుజుండు వస్త్రహీను
డై జనియించును హిరణ్యంబు మీదనధికారియైయున్న మను
జుండు బ్రహ్మరాక్షసుండై జన్మించును మాయావాదిమనుజుం
డాసనగండమాలయై జన్మించును భగవదపచారంబు చేసినమను
జుండు సర్పంబై జన్మించును పజ్క్తిలో పక్షపాతంబు చేసిన
మనుజుండు రోగియై జన్మించును. హరిదాసుల నాడితప్పిన
మనుజుండు మూగవాడై జన్మించును గాషుచిలుకను బెంచిన
మనుజుండు సంకిళ్ళకు బ్రాప్తుండగును. భూతపిల్లిని బెంచిన
మనుజుండు చరసాలకు ప్రాప్తుండగును. బుణ్యస్త్రీలను మోహిం
చిన మనుజుండు కను దృష్టిలేక యంధకుడై జన్మించును, బెద్దల
యిన వారిని హాస్యంబు చేసిన మనుజుండు నత్తిమాటలవాడై
జన్మించును. మీదాసాన దాసులను గృహము వెళ్ళదోలిన
మనుజుం డూరిచావడి గళ్ళ పంచమారియై జన్మించును. చదువు
లకు నేనేర్పరినని గర్వించిన మనుజుండు మతిహీనుడై జన్మిం
చును. కులమువారిని వెక్కిరించిన మనుజుండు చండాలుడై
జన్మించును. విశ్వసించిన వారిని నటమరించిన మనుజుండు శిఖం
డియై జన్మించును. హరికీర్తి కంటకంబై యితర దైవకీర్తనము
చేయు మనుజుం డఘోరంబైన చెవిటివాడై జన్మించును.

పరుల జెడనాడిన మనుజుండు బాహువికారియై జన్మించును. చాడిచెప్పి పరులజెరిచిన మనుజుండు జిహ్వాచ్ఛేదనుండై జన్మించును. కలహంబునకు నధిక ప్రియుడైన మనుజుడు గర్భశిలయై జనియించును. ధర్మమందు పక్షపాత మాడిన మనుజుండు గర్భములో బల్ల గలవాడై జన్మించును. బహు పురుషార్థంబుగాని మనుజుండు బంధుహీనుడై జన్మించును. మధ్యాహ్న కాలంబున నతిథికి నన్నంబు లేదనిన మనుజుండు పాపంబున కాలయుండై జన్మించును అన్నదమ్ముల నవలాలించిన మనుజుండు ధనభ్రష్టుడై జన్మించును. వావివరుసలెరుగక తిరిగిన మనుజుండు వారకాంతయై జన్మించును. బలిమిని బరస్త్రీలను బొందిన మనుజుండు దుఃఖరూపియై జన్మించును. స్త్రీలను జంపిన మనుజుండు కాళ్ళుచేతులు లేని మొండెమై జన్మించును. తాను గనిపెంచిన సుతుల నొక్కటిగా జూడని మనుజుండు వ్యాఘ్రంబై జన్మించును. పెనిమిటి తనపాలి దైవమని యెరుగక పరానుకూలయై నడిచిన భార్య యేడుజన్మంబులు దాసీభూతంబై జన్మించును. తనకైన కులాంగనను విడిచిన మనుజుండు దాసీపుత్రుండై జన్మించును. గుణవతియైన కాంతను నెదురాడి తిట్టిన మనుజుండు గ్రామశునకంబై జన్మించును. కోపంబున బడిచచ్చిన మనుజుండు భూతంబై జన్మించును. జీవరాసుల రతిచెరిచిన మనుజుండు నపుంసకుడై జన్మించును. స్త్రీపురుషుల రతిచెరిచిన మనుజుండు మూషకమై జన్మించును. బహుజీవరాసుల జేయరాని హింసల జేసిన మనుజులకు సంతానంబు వర్ధిల్లకపోవును, వివాహంబు తప్పించిన

మనుజుండు గోడ్డుపోత్తై పెండ్లిలేకపోవును. ధారపోసిన వస్తువు నివ్వకపోయిన మనుజు డూనరవల్లియై జన్మించును. దారాదత్తము పట్టిన బ్రాహ్మణుం డడుగకున్న తోండయై జన్మించును. ఆశించినవాని విడిచిన మనుజులు కుష్టువ్యాధి బొందుదురు. ధనవంతుడై యుండియు బాత్రాపాత్రంబు లెరింగి దానంబుచేయని మనుజుండు మార్జాలంబై జనియించు దన్నేలిన రాజుకొరకై చచ్చిన మనుజుండు వారివంశంబునం బుట్టి వారి పట్టము గట్టుకొని యేలుచుండును. తనకు బుణ్యంబని చేసిన ధర్మంబిందర జాల మహేంద్రజాలంబు వంటిది. యొకటిపదియై యనుభవింప జేయును. తన పాలదైవంబునకు సమర్పణంబు చేసిన ధర్మంబులు ముక్తితెరువు జూపును గావున మున్నూట యరువది రోగములకు మూలంబైన మందు శ్రీమన్నారాయణ స్మరణంబు దప్ప మరి వేరులేదు. దేవా యిది సత్యంబు సత్యంబు నమోనమో శ్రీశఠకోప దేశికోత్తమా॥ ౧౦౧

శఠకోపవిన్నపములు సంపూర్ణము.

